# సమాధి

## మరణ శరీరము



## శిశు శరీరము



## సమాధి


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**





# సమాధి

రచయిత

**త్రిమత ఏకైక గురువు**

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (86) దశ అష్టాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–38 ద్వితీయ ముద్రణ : ఫిబ్రవరి–2017

ప్రతులు : 1000 **వెల : 70/-**




## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు

### "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
10) గీతా పరిచయము
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బొర్మడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.
54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) నీకు నా లేఖ.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
61) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
62) ఒక్కడే ఇద్దరు.
63) విశ్వ విద్యాలయము
64) భావము-భాష

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

65) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
66) మరణము తర్వాత జీవితము.
67) ఏ మతములో ఎంత మతద్వేషము?
68) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
69) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
70) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
71) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
72) ఒక మాట మూడు గ్రంథములు.
73) లు అంటే ఏమిటి? (తెలుగు)
74) ఆదిత్య.
75) చెట్టుముందా! విత్తుముందా?
76) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
77) దేవుని రాకకు ఇది సమయము కాదా!
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
80) గీటురాయి
81) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు
82) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు
83) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ
84) నాది లోచన-నీది ఆలోచన
85) దేవుని ముద్ర
86) ధర్మచక్రము
87) హిందూమతములోనే కులవివక్ష
88) యోహాను చెప్పిన జ్ఞానము
89) ప్రాథమిక జ్ఞానము.
90) రాజకీయము×రాజకీయము.
91) ఉగ్రవాదము స్వర్గము కొరకే.
92) ఒక వ్యక్తిలో రెండు కోణములు.
93) మానవత్వము.
**94) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**95) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**96) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**97) అంతిమ దైవగ్రంథములో వజ్రవాక్యములు**

# ఇతర సంఘముల ప్రచురణలు

## ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ

1. అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు. 2. ఖుర్‌ఆన్‌లో ఆణిముత్యాలు.
3. అంతిమ దైవగ్రంథములో అర్థాలు-అపార్థాలు. 4. జకాత్ (ఆర్థిక సేవ).
5. అంతిమ దైవగ్రంథములో జ్ఞాన రత్నాలు. 6. షరియతా-జ్ఞానమా.
7. అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు. 8. ఖుదా-అల్లాహ్. 9. రెక్కల గుఱ్ఱము.
10. చంద్రుడు-నక్షత్రము.

## సువార్త క్రైస్తవ సంఘం

1. మతాలన్నిటికి ప్రాథమిక జ్ఞానము.
2. మత ధిక్కారము కాదు-సత్యగ్రాహితము.
3. పాప క్షమాపణ ఎలా కలదు?
4. ముందు చూపు.

## రావణ బ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం

1. త్రైత సిద్ధాంత పరిశీలన
2. త్రైత సిద్ధాంతం సూపర్ సైన్స్
3. కాలజ్ఞానములో ఆనంద గురువు.
4. అంతర్ ధన శతకము (జ్ఞాన ధన శతకము)
5. బెర్ముడా ట్రయాంగిల్-సైంటిస్ట్‌లకు సవాల్
6. ట్విన్ టవర్స్ (9/11) ట్రూత్
7. తెలుగు-వెలుగు

## ద్రావిడ శ్రేష్ఠి సంఘం

1. సంఖ్య లో అంఖ్య



*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము.
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూ మహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము.
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు.
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవుని జ్ఞానము-మాయ మహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. త్రైత సిద్ధాంతము.

*DVD'S*

62. కర్మ లేని కృష్ణుడు-
 కర్మ ఉన్న కృష్ణుడు.
63. సహజ మరణం- తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము.
65. దేశం మోసం-దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం-
 రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు-
 అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము?
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ - నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము-ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
 మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
89. 6-3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది!
98. భక్తి-భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము-అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి-శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము - బోధ.
110. ఆట - దోబూచులాట.
111. ప్రజలు - మానవులు.
112. ఆస్తి - దోస్తి.
113. దంతము-అంతము.
114. మాయ మర్మము- ఆత్మ ధర్మము
115. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
116. అంతిమ గ్రంథములో
 ప్రథమ వాక్యములు.
117. అదురు-బెదురు.
118. శవము-శివము
119. ధర్మచక్రము
120. గ్రాహిత శక్తి
121. భౌతికము-అభౌతికము
122. దేవుని ఆజ్ఞ-మరణము
123. ఆధ్యాత్మిక ప్రశ్నలు - జవాబులు.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా. T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**P.M.H నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

**P. రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, బస్స్టాండు రోడ్
కోయిలకుంట్ల (మం), కర్నూలు (జిల్లా)
Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)** MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్రెసిడెంట్)**
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**www.thraithashakam.org | Email : info@thraithashakam.org**

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:7680065963, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# యోగీశ్వరుల వారి రచనల సారాంశము

1) త్రైత సిద్ధాంత గ్రంథములలో అక్షర సముదాయమే, ఆత్మ సమాచారమై ఉన్నది. త్రైత సిద్ధాంత గ్రంథములలో క్షయ అక్షయ సమాచారము, పరమాత్మ సమాచారము ఉన్నది.

2) త్రైత సిద్ధాంత సంబంధ గ్రంథములను భౌతికముగా వ్రాసినది యోగీశ్వర్లు. త్రైత సిద్ధాంత అనుబంధ గ్రంథములలో అభౌతికముగా యోగశక్తి ఉన్నది.

3) త్రైత సిద్ధాంతము ఇందూ (హిందూ) ధర్మములలో విప్లవాత్మకమైనది. త్రైత సిద్ధాంత గ్రంథములలోని జ్ఞానము సంచలనాత్మకమైనది, చదివి చూడండి.

4) త్రైత సిద్ధాంతము లోకములో అన్నిటికంటే గొప్పది. త్రైత సిద్ధాంత గ్రంథములు అన్ని గ్రంథములను మించినవి, దాని రచయిత యోగులకు ఈశ్వరుడైన యోగీశ్వరుడు.

5) త్రైత సిద్ధాంత గ్రంథములు కనిపిస్తే దుష్టశక్తులు భయముతో వణికిపోతాయి. త్రైత సిద్ధాంత గ్రంథములను దగ్గర ఉంచితే యోగశక్తికి తాళలేక భయపడిపోతాయి.

6) త్రైత సిద్ధాంత జ్ఞానము భగవద్గీత తరువాత చెప్పబడిన అతి గొప్ప జ్ఞానము. త్రైత సిద్ధాంత గ్రంథములలో కృష్ణుడు ముందు చెప్పని జ్ఞానమును కూడా యోగీశ్వర్లు చెప్పారు.

7) త్రైత సిద్ధాంత జ్ఞానము మానవ జీవితమునకు గొప్ప వెలుగు. త్రైత సిద్ధాంత వెలుగులోనికి పోయిన వానికి అది దైవశక్తి అని తెలియును.

8) త్రైత సిద్ధాంత భగవద్గీతను వ్రాసినది యోగీశ్వర్లు. అందువలన త్రైత సిద్ధాంతము అంటే ఏమిటో, అది ఎంత గొప్పదో తెలియబడినది.

9) త్రైత సిద్ధాంతమును గురించి తెలియగలిగితే, యోగీశ్వరుల గ్రంథములను చదువగలిగితే, ఏ మతస్థుడైనా ఒప్పుకొని తీరును, దానిని ఆచరించును.

10) త్రైత సిద్ధాంతము ప్రత్యక్షముగా భగవంతుడు చెప్పినది. అందువలన అన్ని మతముల సారాంశము త్రైత సిద్ధాంత గ్రంథములలో కలదు.

11) త్రైత సిద్ధాంత గ్రంథములు వ్యక్తి వ్రాసినవి కావు, వ్యక్తిలోని శక్తి వ్రాసినవి. అందువలన అన్నీ రహస్యములే చదివి తెలుసుకోండి.

12) త్రైత సిద్ధాంతము భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలో కలదు. అయినా హిందువులకుగానీ, క్రైస్తవులకుగానీ, ముస్లీమ్‌లకుగానీ ఆ విషయము తెలియదు.

# సమాధి



సమాధి అను పదము చాలా కాలమునుండి ప్రచారములో ఉండినా, ఆ పదము కాలగమనములో రూపాంతము పొందినదని తెలియు చున్నది. నేడు సమాధి అని పలకబడు పదము మొదట సమాదిగా ఉండేది. మొదట సమాది చివరకు కాలగమనములో సమాధిగా మారి పోయినా, సమాదికి మరియు సమాధికి వేరు అర్థములున్నా, ప్రజలందరికీ తెలిసిన అర్థము ఒకటి గలదు. అది ఏమనగా, మనిషి చనిపోయిన తర్వాత మృతదేహమును భూమిలో పూడ్చిపెట్టడమును సమాధి అంటున్నారు. ఈ భావమును అనుసరించి కొన్ని మతములలో, చనిపోయిన మనుషులను ప్రళయ కాలములో దేవుడు తిరిగి సమాధులనుండి లేపుతాడనీ, అప్పుడు వారు చేసుకొన్న పాపపుణ్యములను విచారించి పాపమునకు తగినట్లు నరకమునకు, పుణ్యమునకు తగినట్లు స్వర్గమునకు పంపుననీ చెప్పుకోవడము జరుగుచున్నది. హిందూమతములో కూడా స్వర్గనరకములున్నవని చెప్పినా, మనిషి చనిపోయిన వెంటనే స్వర్గ నరకములకు పోవుననీ, తర్వాత అవి అయిపోయిన వెంటనే తిరిగి పుట్టుననీ చెప్పుకోవడము జరుగుచున్నది. మొత్తానికి అన్ని మతములవారూ స్వర్గ నరక లోకములున్నవని నమ్ము చున్నారు. చనిపోయిన శరీరమును సమాధి చేయడము అనునది అన్ని మతములలోనూ గలదు. స్వర్గ నరకములు మనిషియొక్క నమ్మకమేగానీ చూచివచ్చి చెప్పిన వాడు ఎవడూ లేడు. కానీ సమాధి అనునది చనిపోయిన మనిషిని పూడ్చిపెట్టు జాగా అని ప్రత్యక్షముగా అందరికీ తెలుసు. స్వర్గ నరకములు కేవలము నమ్మకము మాత్రమేకాగా, సమాధి మాత్రము ప్రత్యక్ష సత్యము.

ప్రజల మనోభావములో సమాధి ఒక పవిత్ర భావముతోనే ఉన్నది. ఒక గొప్ప వ్యక్తి మృత దేహమును కాల్చినా, కాల్చిన బూడిదను

సముద్రములో కలిపినా, కాల్చిన చోట ఆ వ్యక్తియొక్క జ్ఞాపకార్థము ఒక సమాధిని నిర్మించి, ఇది ఫలానా వ్యక్తి సమాధి అని చెప్పుకోవడము జరుగుచున్నది. ఇస్లామ్ మతములో ఒక తెగవారు దైవమార్గములో నడచిన గొప్ప వ్యక్తుల సమాధులకు దర్గాలని పేరు పెట్టి గౌరవముగా ఆరాధించడము జరుగుచున్నది. అలాగే హిందూమతములో కూడా కొందరి సమాధులను గొప్పగా భావించి పూజించడమూ జరుగుచున్నది. కొందరైతే తమ కుటుంబములోని వ్యక్తుల సమాధులను సంవత్సరమునకొకమారు పూజించడము జరగుచున్నది. ఈ విధముగా మనుషులలో సమాధి అనునది గొప్ప భావముతోనే ఉన్నదని చెప్పవచ్చును. కొన్ని చోట్లయితే సమాధి మనుషుల లెక్కలో పుణ్యక్షేత్రముగా, పూజ్య స్థలముగా మారిపోయినవి గలవు. సమాధులు మనుషుల లెక్కలో గొప్ప భావముతో ఉండిన విషయమును దృష్టిలో పెట్టుకొని, కొందరు రాజులు వారి మృతదేహములకు సమాధులు కట్టునట్లు చనిపోకముందే ఏర్పాటు చేసుకొని సమాధి కట్టించుకొనినా, అవి గుర్తింపులేకుండా మిగిలిపోయినవి ఎన్నో గలవు. కొన్ని గుర్తింపుగా మిగిలిపోయినవీ గలవు. తాజ్‌మహల్ గుర్తింపు పొందిన సమాధిగా మిగిలిపోయిన విషయము అందరికీ తెలుసు. ఈ విధముగా ప్రజల మనోభావముల మీద ఎంతో గట్టి ముద్రవేసుకొన్న సమాధి యొక్క సమాచారమును పూర్తి విప్పి చూస్తే ఇలా గలదు.

సమాధి అనగా అందరికీ సమముగా వర్తించునది అని అర్థము. ఈ అర్థము కొత్తగా కనిపించినా ఇదియే వాస్తవమైన అర్థము. కొందరు సమాధి అను దానికి అర్థము ఇలా చెప్పారు. **ధీ** అనగా బుద్ధియనీ, సమ+ధి = సమాధియని, బుద్ధికి సమానముగా ఉన్నదని చెప్పారు. ఇది చెప్పుకోవడానికి బాగుంది. కానీ ఆ అర్థము ఏ విషయములో వర్తిస్తుందో,

బుద్ధికి సమానముగా ఉన్నది ఏదో, అది బ్రతికి ఉన్నపుడా? చచ్చి పోయినపుడా? అను ప్రశ్నలు రాగలవు. చచ్చిపోయిన వానికి బుద్ధి ఎటూ ఉండదు. బ్రతికి ఉన్నవానికి సమాధితో పనిలేదు, వాడు దానిని పొందడు. సమాధి చనిపోయిన వానికే అవసరమైనపుడు, వాని బుద్ధిని గురించి చెప్పుకోవలసిన అవసరమూ లేదు. ఎందుకనగా చనిపోయిన వానికి బుద్ధి ఉండదు. ఈ విధముగా యోచిస్తే సమమైన బుద్ధి అను అర్థము తప్పు అని తెలియుచున్నది. ఎవరు ఏ అర్థమును చెప్పినా అది ఆధ్యాత్మిక విద్యకు సరిపోదు. అందువలన అందరికీ సమముగా అమలు జరుగునది లేక అందరికీ సమానముగా వర్తించునను అర్థము ఆధ్యాత్మికమునకూ, ప్రత్యక్ష అనుభవమునకూ సరిపోవును. నేడు సమాధి అను పలుకబడు పదము పూర్వము సమ+ఆది, సమాది గా ఉండేది. **ది** కి క్రింద పొక్కిలి లేదు. ఆది అనగా మొదటిలో లేక సృష్టి మొదటిలో అని అర్థము. సమ అనగా అందరికి తెలిసిన అర్థమే, సమాది అనగా సృష్టి మొదటినుండి అందరికి సమముగా ఉన్నదని లేక వర్తించుచున్నదని అర్థము. ఇక్కడ విశేషమేమనగా సృష్టి ఆదినుండి అనుటలో సృష్టి ప్రారంభముమైన తర్వాత అందరికి మొదటి నుండి సమాది ఉన్నదని తెలియుచున్నది. ఆదినుండి సమముగా ఉన్నది కావున, ఈ సమాది మొదటినుండి మొదలైనదని తెలియుచున్నది. జీవుని మొదటి పునర్జన్మలోనే సమాది కలదు. మనిషి చనిపోయిన తర్వాత ఏర్పడునది సమాది కాదు. మనిషి చనిపోయినపుడు సమాది అనునది అందరికీ సమముగా వర్తించదు. ఈ మాటలు వినే మీకు ఇదంతా క్రొత్తగానే కనిపించును. కొందరు మా మాటలను ఏమాత్రము నమ్మరు. కొందరు అన్వేషకులుగా ఉన్నవారు పరిశోధనా బుద్ధితో యోచించుదురు. అట్లు యోచించువారికి తప్పకుండా సత్యము తెలియును. ఒక మనిషి చనిపోయి నపుడు అతని శరీరమును భూమిలో పూడ్చిపెట్టినా, దానిని అర్థము ప్రకారము

సమాధి అనిగానీ, సమాది అనిగానీ అనుటకు వీలులేదు. ఈ అర్థములు పూడ్చబడిన గుంతలకుగానీ, కట్టబడిన గోరీలకుగానీ వర్తించవు.

అన్ని మతములలోను సమాధి అను పదముండినా, ప్రవక్తలందరూ ఎంతో గొప్ప భావముతో చెప్పినా, దానిని ఏ మతస్థులూ సరిగా అర్థము చేసుకోలేదని చెప్పుచున్నాము. మాకందరికి అర్థము కానీదీ, మాకంటే మించిన జ్ఞానపండితులకందరికీ అర్థము కానిదీ, నీకొక్కనికే అర్థమైనదా అని ఎవరైనా నన్ను ప్రశ్నించవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా? ఏది నిజమైన జ్ఞానము, ఎవరిది నిజమైన జ్ఞానము అను ప్రశ్నకు జవాబుగా, ఎక్కడైతే ప్రశ్న మిగిలిపోయి జవాబు లేకుండా పోవుచున్నదో అది నిజమైన జ్ఞానము కాదు. ఎక్కడైతే ప్రశ్న మిగలకుండా సర్వత్రా జవాబు ఉన్నదో, ఎక్కడైతే ఎవరూ ఎదురు ప్రశ్నించని జ్ఞానమున్నదో, అదియే నిజమైన దేవుని జ్ఞానమని చెప్పవచ్చును. నేను చెప్పిన సమాది విషయములో గానీ, ప్రవక్తలు చెప్పిన సమాది వివరములోగానీ ఎక్కడా ప్రశ్నలు మిగలవు. అందువలన ఇక్కడ మేము చెప్పు జ్ఞానము నిజమైన దైవజ్ఞానమనీ, అదియే నిజమైన ధర్మమనీ తెలుపుచున్నాము. ఇతరులు చెప్పు సమాధి విషయములో చివరకు ప్రశ్నలు మిగిలి సమాధానము లేకుండా పోవుచున్నది. అందువలన అది సూత్రము ప్రకారము నిజమైన దైవజ్ఞానము కాదని చెప్పవచ్చును. అన్ని మతముల గ్రంథములలో కూడా మేము చెప్పిన విషయమునే నూటికి నూరుపాళ్ళు ప్రవక్తలందరూ చెప్పారు.

అయితే ఒకేఒక్క పొరపాటు జరిగినది, మనిషి మాయ వశమైపోయి దేవుడు చెప్పిన దానిని తప్పుగా అర్థము చేసుకొన్నాడు. అదియే మనిషి చేసిన పెద్దపొరపాటు. ఆ పొరపాటుతోనే దేవుని ధర్మము మనుషుల మధ్యలో అధర్మముగా మారిపోయి ప్రచారమైనది. ఊరంతా ఉత్తరమంటే

ఒక్కడు మాత్రము దక్షిణమన్నట్లు  మనుషులైన అందరూ మరణము జరిగినపుడు సమాధి అంటే, మేము మాత్రము అది సత్యమే కాదు, మనిషి జన్మించినపుడే సమాది అంటున్నాము.  ఎవరూ చెప్పని దానిని దేవుడు చెప్పాడు, ప్రవక్తలు చెప్పారనుచూ, నీవు ఒక్కనివే విరుద్ధముగా ఎందుకు మాట్లాడుచున్నావు? అని నన్ను ఎవరైనా ప్రశ్నించివచ్చును.  దానికి ధైర్యముగా మేము ఒకే జవాబును చెప్పుచున్నాము.  ఏది సత్యమో దానినే మేము చెప్పుచున్నాము.  అసత్యమును లోకములో  ఉండిన వారందరూ సత్యమే అనినా అది సత్యముకాదు.  దానిని నేను ఒప్పుకోను.  అంతేకాక దేవుడు చెప్పిన ప్రత్యక్ష సత్యమును గ్రహించక, అసత్య విషయమును మీరెట్లు సమర్థిస్తున్నారని మేము కూడా ప్రశ్నించుచున్నాము.  కానీ మా మాట చాలామందికి మొండివాదనగా కనిపించుచుండును.  బాగా యోచించు కొందరికి మా మాట సత్యమని తెలియ గలదు.  ఇంతవరకు అందరికీ సమాధి అను పదము సాధారణముగా కనిపించినప్పటికీ, ఇప్పుడు మేము చెప్పు భావముతో **సమాది** అను శబ్దము సామాన్యమైనది కాదనీ, ఇదేదో గొప్ప అర్థముతో కూడుకొన్నదేకాక, ధర్మాధర్మ విషయములతో ముడిపడి వున్నదని కూడా అర్థమగుచున్నది. మనుషులందరు మభ్యపడిపోయిన సమాధి (సమాది) ఏమిటో? ఎలా ప్రత్యక్ష ప్రమాణమో వివరించుకొని చూస్తాము.

గర్భము అనుమాట అందరము వినివుంటాము.  తల్లిగర్భము, భూగర్భము అనుమాటలను విని వుంటాము.  గర్భము అను పదమునకు అర్థము కనిపించకుండా కప్పివుంచునదని తెలియుచున్నది.  తల్లిగర్భము శిశు శరీరమును కప్పివుంచినది.  అలాగే భూగర్భము మృత శరీరమును కనిపించకుండా కప్పివుంచినది.  దీనినిబట్టి గర్భములు రెండు రకములనీ ఒకటి పుట్టే క్రొత్త శరీరమును దాచివుంచునది, రెండు చనిపోయిన

పాతశరీరమును దాచివుంచునదని తెలియుచున్నది. భూగర్భమును అందరూ సమాధి అని అనడము జరుగుచున్నది. భూగర్భమును సమాధి అనడము చాలా పెద్ద పొరపాటు. ఎందుకనగా! భూగర్భములోని శరీరము మృతి చెందినది. ఆ శరీరములో జీవుడు లేడు మరియు ఆత్మ లేదు. జీవుడుగానీ, ఆత్మగానీ ఉన్నపుడయితే జీవునికి సమముగా వర్తించునదని చెప్పవచ్చును. జీవుడే లేనపుడు జడమైన శరీరమునకు సమముగా వర్తించునదని చెప్పుటకు వీలులేదు. జీవుడు లేని శరీరము గుర్తింపులేనిది, కావున మృత శరీరమునకు సమాధి (సమాది) అనుమాట వర్తించదు. అట్లే తల్లి గర్భములోని శిశు శరీరములో కూడా జీవుడూ లేడు, ఆత్మయూలేదు. కావున తల్లి గర్భమును కూడా సమాది అనుటకు వీలులేదు. తల్లిగర్భముగానీ, భూగర్భముగానీ, ఒకటి పుట్టబోయే శిశు శరీరమునూ, మరొకటి చనిపోయిన మృత శరీరమును దాచివుంచునవే తప్ప అవి సమాదులు కావు. **గర్భము అనగా మర్మముగా ఉంచునది లేక రహస్యముగా దాచినదని అర్థము.**

భూగర్భమునకు గానీ, తల్లి గర్భమునకుగానీ సమాధి (సమాది) అను పేరు వర్తించనపుడు బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము ఆధ్యాత్మిక విద్యను అనుసరించి సమాది అనునది ఎక్కడున్నది? దేనిని సమాధి అనవచ్చును అని ప్రశ్న రాగలదు. దానికి మా జవాబు ఏమనగా! ఒక మనిషిని ప్రకృతి భాగమనీ, ఆత్మ భాగమనీ రెండు భాగములుగా విభజించి చూడవచ్చును. ప్రకృతి భాగములో మొత్తము శరీరముండును. ఆత్మ భాగములో జీవాత్మ, ఆత్మ ఉండును. అంతేకాక పరమాత్మ కూడా ఉండును. కానీ పరమాత్మ శరీరము బయట, శరీరము లోపల ఉండు దానివలన ఆత్మ భాగములుగా జీవాత్మ, ఆత్మను మాత్రము పరిగనలోనికి తీసుకొన్నాము. జీవాత్మ, ఆత్మ లేని 24 భాగముల శరీరమును ఒక

భాగముగా, జీవాత్మ ఆత్మను మాత్రము ఒక భాగముగా గుర్తించితే ప్రకృతి భాగమైన శరీరమునకు సమాది లేదని తెలియుచున్నది. జగతిలో ధర్మములకు గ్లాని ఏర్పడి అధర్మములు ప్రచారమైనపుడు సమాది అను ధర్మము అధర్మముగా మారిపోయి, వాస్తవమైన సమాది తెలియకుండా పోయి, అసత్యమైన సమాది తెలియుచున్నది. దానివలన ప్రజలు భూగర్భమును సమాది అనుకోవడము జరుగుచున్నది. భూగర్భమును సమాధి అనుకోవడము అధర్మము అని ఎవరికీ తెలియకుండా పోయినది.

ప్రకృతి భాగమైన శరీరమునకు కాకుండా జీవాత్మకూ, ఆత్మకూ మాత్రమే సమాది ఉన్నదనీ, ఆత్మ భాగములైన జీవాత్మ, ఆత్మలకున్న సమాదియే నిజమైన సమాది అనీ, అదియే దైవధర్మమని తెలియవలెను. జీవునికి జన్మ (పునర్జన్మ) మొదటినుండి ఉన్నదానివలన "ఆది" అని చెప్పడమే కాక, జీవులందరికి ఒకే విధముగా వర్తించునది కావున "సమ" అని చెప్పడము జరిగినది. దానినే పూర్తిగా సమాది అని అన్నారు. మేము చెప్పునది అందరికీ క్రొత్తమార్గముగా కనిపించినా, ఇది ఇంతవరకు అణగారి పోయిన ధర్మమని తెలియవలెను. ప్రవక్తలందరూ ఇదే ధర్మమును తెలియ జేసినప్పటికీ, ప్రజలు దానిని అందుకోలేక పోయారని చెప్పవచ్చును. ప్రవక్తలు చెప్పిన సమాది ధర్మమును విశదముగా తెలుసుకోగలిగితే, మనిషి చనిపోయినపుడు శరీరమును వదలి జీవాత్మ, ఆత్మలు బయటికి పోవును. ఆ విధముగా మరణములో జీవాత్మ, ఆత్మలు వదలిన శరీరమును భూగర్భములో (భూమిలో) పూడ్చిపెట్టితే అది సమాది కాదు. సమ+ఆది = సమాది అను అర్థము భూగర్భమునకు వర్తించదు. అలాగే తల్లి గర్భము లోని జీవాత్మ, ఆత్మలేని శిశు శరీరమునకు కూడా సమాది పదము వర్తించదు. జీవాత్మ, ఆత్మ ఎక్కడ నిక్షిప్తమై పోవుచున్నారో దానినే సమాధి లేక సమాది

అనవచ్చును. జీవుడు జన్మించు సమయమును "ఆది" అనవచ్చును. జీవుడు శరీరమును ధరిస్తే దానిని జన్మ లేక పునర్జన్మ అంటున్నాము. అలా శరీరమును ధరించు మొదటి సమయమును "ఆది" అనడమేకాక, అది జీవులందరికి సమముగా వర్తించునది కావున సమాది అనడము జరిగినది. ఒక జీవుడు శరీరములో ప్రవేశించి, ఆ శరీరములో నిక్షిప్తమై (దాచబడి) ఎవరికీ కనిపించకుండా ఉండడమును వాస్తవముగా సమాది అనవచ్చును.

ఆత్మ, జీవాత్మలు రెండూ జోడు ఆత్మలు, ఒకదానిని వదలి ఒకటి ఉండుటకు వీలులేదు. జీవుడు జన్మలకు పోకుండా మోక్షమును పొందినపుడే ఆత్మ జీవాత్మ ఒకదానిని ఒకటి కలిసిపోవడము జరుగుతుంది. అంతవరకు ఎన్ని యుగములు గడచినా, ఎన్ని కల్పములు అయిపోయినా జీవాత్మ ఆత్మలు విడిపోవు. శరీరము మరణించినపుడు శరీరమును వదలి పోయిన జీవాత్మలు ఆత్మలు కర్మ ప్రకారము నిర్ణయింపబడివున్న వేరొక శరీరమును చేరును. అలా వేరొక శరీరమును చేరడమును జన్మ లేక పునర్జన్మ అనవచ్చును. శరీరమును వదలి పోవడమును మరణమనీ, క్రొత్త శరీరమును చేరడమును జననమనీ, అందరికీ తెలిసినా మరణములో ఏమి జరుగుచున్నదీ, జననములో ఏమి జరుగుచున్నదీ వాస్తవముగా ఎవరికీ తెలియదు. జనన మరణములు బ్రహ్మవిద్యా శాస్త్రములో సిద్ధాంతములే అయినప్పటికీ అవి ఎవరికీ తెలియవు కావున రహస్యములుగా మిగిలి పోయాయి. మేము గతములో వీటి వివరము అందరికి అర్థమగులాగున **"జనన మరణ సిద్ధాంతము", "మరణ రహస్యము", "పునర్జన్మ రహస్యము"** అను గ్రంథము లను వ్రాయడము జరిగినది. ఇప్పుడు సమాది అను పేరుతో ఈ చిన్న గ్రంథము వ్రాయడము జరుగుచున్నది.

మరణములో జీవుడు శరీరమును పూర్తిగా వదలి పునర్జన్మకు పోవడము జరుగుచున్నది. పాత శరీరమును వదలిన క్షణమే ఆలస్యము లేకుండా ఆత్మతో సహా జీవాత్మ క్రొత్త శరీరములోనికి చేరిపోవుచున్నది. పాత శరీరము అనగా మృతి చెందినదని అందరికీ తెలుసు. కానీ క్రొత్త శరీరము యొక్క విషయములోనే మనిషి పొరపాటుపడుచున్నాడు. జీవుడు ధరించు శిశు శరీరము క్రొత్త శరీరమని అందరికి తెలిసినప్పటికీ, దానిని జీవుడు ఎప్పుడు ధరిస్తున్నాడని సరిగా తెలియలేక పోయారు. ఏ దశలో క్రొత్త శరీరమవుతుంది? జీవుడు ఎప్పుడు దానిలోనికి ప్రవేశిస్తున్నాడు? ఎలా ప్రవేశిస్తున్నాడు? అను విషయములే ఎవరికీ తెలియకుండా పోయాయి. ఎవరికి తెలిసినా తెలియకుండా పోయినా, తల్లి గర్భములో పూర్తి తయారైన శిశుశరీరము ప్రసవింపబడిన తర్వాత జీవుడు చేరుటకు యోగ్యముగా ఉండును. కాబట్టి తల్లిగర్భమునుండి పుట్టిన శిశు శరీరము క్రొత్త శరీరము అగుచున్నది. ప్రసవింపబడి జీవము లేకుండా ఖాళీగానున్న శిశు శరీరము లోనికి జీవాత్మ ఆత్మ చేరిపోవుచున్నవి. అలా జీవుడు శిశు శరీరములోనికి చేరిపోవడమును పునర్జన్మ అనుచున్నాము. పునర్జన్మ విషయమే మనుషులకు అర్థము కాకుండా పోయింది. పునర్జన్మలో ప్రసవింపబడిన శిశుశరీరము క్రొత్త శరీరమను మాట తెలియకుండా పోయినది. తల్లిగర్భములోని అసంపూర్ణ శిశు శరీరములోనికే జీవుడు చేరుచున్నాడని అందరూ అనుకోవడమేకాక, విజ్ఞానులనువారు కూడా అనుకోవడము జరుగుచున్నది. ముఖ్యముగా ఇక్కడే అందరూ పొరపడిపోయారు. సైన్సు అని చెప్పుకొను వారు సైన్సులోని నిజమును తెలియకుండానే, సైన్సు అను పేరు చెప్పు కొంటూనే మూఢనమ్మకములో పడిపోయారు. విజ్ఞానము (సైన్సు) ప్రకారము గర్భములోని శిశువులోనికి ఇంతవరకూ ఏ జీవుడూ చేరలేదు. అట్లు

చేరినట్లు ఎవ్వరూ నిరూపించలేరు. ఈ మాట విన్నటువంటి కొందరు గైనకాలజిస్టు డాక్టర్లు నవ్వుకోవడము జరిగినది. వీర్యకణములోనే జీవమున్న దని వారి నమ్మకము. అందువలన వారు అలా నవ్వడము జరిగినది. సైన్సు ప్రకారము ఇంకా పరిశోధన జరుగవలసివున్నదనీ, ఇంతవరకు తమకు తెలిసినది సత్యముకాదనీ వారికి తెలియదు.

ఈ విధముగా భౌతిక శాస్త్రవేత్తలకు కూడా పునర్జన్మ విషయములో జీవుడు ఎప్పుడు క్రొత్త శరీరములో ప్రవేశిస్తున్నాడో, ఏది క్రొత్త శరీరమో తెలియకుండా పోయినది. పునర్జన్మ విషయమే తెలియనపుడు, దానికి అనుబంధముగానున్న సమాది కూడా ఎవరికీ తెలియకుండా పోయినది. జన్మ తర్వాతనే సమాదివుంటుంది. జన్మను అనుసరించి సమాదివుంటుంది. కావున జన్మ వివరము తెలియనిదే సమాది విషయము తెలియుటకు వీలు పడదు. ఇంతవరకు భూమిమీద జన్మ విషయమే రహస్యముగా తెలియకుండా పోయినప్పుడు జన్మను అనుసరించిన సమాది ఎలా తెలియును? జన్మ (పునర్జన్మ) విషయము తెలియనిది సమాది తెలియదు. కావున భూమిమీద సమాది యొక్క అర్థముగానీ, సమాది యొక్క నిజ స్థితిగానీ ఎవరికీ తెలికుండా పోయినది. తల్లిగర్భములోని శిశువుకు ప్రాణము లేదనీ, జీవుడు దానిలోనికి ప్రవేశించుటకు వీలులేదనీ, అది అసంపూర్ణ శరీరమేగానీ, సంపూర్ణమైన క్రొత్త శరీరము కాదనీ, ప్రసవించబడిన శరీరమునే క్రొత్త శరీరమనవచ్చుననీ, ప్రసవించబడిన శరీరములోనికి జీవుడు చేరుచున్నాడని **"జనన మరణ సిద్ధాంతము"** అను గ్రంథములో 1980 సంవత్సరమే మేము వ్రాయడము జరిగినది. వ్రాసి 30 సంవత్సరములైతే దానికంటే పది సంవత్సరముల ముందునుండి ఈ విషయమును చెప్పడము జరిగినది. ఇప్పటికి 40 సంవత్సరములప్పుడే గర్భస్థ శిశువుకు ప్రాణములేదని మేము చెప్పడము

జరిగినది. మేము చెప్పిన విషయము ఎవరూ నమ్మరనీ, ఆ విధముగా వారిలో అంధత్వము పేరుకపోయినదనీ తెలిసినప్పటికీ, మేము సత్యమును చెప్పాలను ఉద్దేశ్యముతో శాస్త్రబద్ధముగా చెప్పడము జరిగినది. భౌతిక శాస్త్రవేత్తలమని పేరుపెట్టుకొన్నవారు కూడా అశాస్త్రీయపద్ధతిలో గర్భములోనే జీవుడున్నాడని చెప్పుచున్నారు. మేము చెప్పుమాట ఋజువు కాగలదు, కానీ గర్భములో ప్రాణమున్నదనుట ఋజువుకాదు. గర్భములో శిశువు సంగీతమును వింటున్నదనీ, గర్భములోని శిశువు బయట మాటలను గ్రహించుచున్నదనీ కొందరు చెప్పిన మాటలు నూటికి నూరుపాళ్ళు అసత్యము. మాకు వాస్తవము తెలుసు కావున ధైర్యముగా వారి మాటను అసత్యమని చెప్పుచున్నాము.

మేము చెప్పు వాస్తవము ఏమిటో 40 సంవత్సరములనుండి చెప్పు చున్నాము. 30 సంవత్సరములప్పుడే గ్రంథ రూపములో వ్రాశాము. మేము చెప్పిన దానిని బట్టి, జీవుడు పునర్జన్మలో శరీరమును ధరించినప్పుడే సమాది ఏర్పడుచున్నది. ఎలా అనగా! జీవుడు ప్రసవింపబడిన క్రొత్త శరీరములో చేరినపుడు జీవుడు శరీరములోపల ఉన్నాడు. ఆ విధముగా జన్మ మొదటి లోనే జీవుడు శరీరమందు నిక్షిప్తమైవుండడమును సమాధి అంటున్నాము. అలా సమాదిలోనున్న జీవున్ని అతనితో పాటువున్న ఆత్మ స్వయముగా బయట ప్రపంచముతో సంబంధము ఏర్పరచుచున్నది. ఆ సమయములో శరీరములోని బుద్ధిగానీ, మనస్సుగానీ బయటి విషయములను గ్రహించ లేని స్థితిలో ఉండును. జీవుడు శరీరమును ధరించిన మొదట మనస్సు యొక్క పనినిగానీ, బుద్ధియొక్క పనిని స్వయముగా ఆత్మే చేయును. బయటి సంబంధము లేకుండా శరీరములో పూడ్చబడివున్న జీవుని స్థితిని సమాది అనవచ్చును. ఆ స్థితి శిశువుగా జన్మించిన ప్రతి జీవరాసికి ఉన్నదే. కావున

అది అందరికి సమానమైనది, అందువలన దానినే సమాదిగా ప్రవక్తలందరూ చెప్పారు. సమాదిలో ప్రపంచ విషయములు ఏవీ తెలియని ఆది కాలములో ఆత్మే స్వయముగా సమాదినుండి ప్రపంచముతో సంబంధము ఏర్పరుచున్నది. కావున అంత్యదినమున సమాదినుండి ఇదే శరీరముతో లేపుదునని చెప్పబడినది. అంత్యకాలము లేక ప్రళయ దినమున అనగా శరీరము నశించి మరణము ఏర్పడిన దినమున అని అర్థము. శరీరము నశించి పూర్తి మరణము పొందిన క్షణమే, క్రొత్త శరీరములోనుండి జీవున్ని బయటి ప్రపంచములోనికి లేపడము జరుగుచున్నది. ఆ విధముగా పునర్జన్మ పొందిన దినము అందరికీ జరుగుచున్నది. ఆ విధముగా అందరికీ సమానముగా జరిగిన దినమున, సమాదినుండి (శరీరమునుండి) లేపబడిన దినమున ఎవని శరీరము మీదకూడా గుడ్డలు లేవు. గుడ్డలు లేకుండా శరీరము ప్రసవింపబడుచున్నదని మరువకూడదు. ఆ విధముగా శరీర సమాదినుండి దేవుడు ఆత్మ చేత లేపిన దినమున మనిషికి (జీవునికి) ఏ గుణములూ లేవు. అప్పుడు ఏ గుణములూ పని చేయడము లేదు. జీవుడు బయటి ప్రపంచములోనికి శరీరముతో లేపబడిన రోజు, ఏ గుణము లేని దానివలన శరీరము మీద గుడ్డలు లేవని సిగ్గుపడడము కూడా ఉండదు. ఆ దినము అంతఃకరణములైన మనస్సు, బుద్ధి, చిత్తము, అహము ఏవీ పని చేయవు. అలాగే గుణములూ పని చేయవు. అవి అప్పుడు పని చేయలేని స్థితిలో ఉన్నవి. ఈ విషయము అందరికీ ప్రత్యక్ష ప్రమాణముగా తెలుసు. అయితే తల్లి గర్భమునుండి పుట్టిన శిశుశరీరమే సమాది అనిగానీ, ఆ శరీరమునుండే మొట్టమొదట ప్రపంచము ధ్యాసలోనికి వస్తున్నామనిగానీ, ప్రళయ దినమున సమాదినుండి ప్రతి ఒక్కరిని లేపుదునని, ఇతర మతములలో దేవుడు చెప్పిన వాక్కు సత్యమైనదనీ తెలియవలెను. ఇది నిత్యము! కనిపించు సత్యము! అంతేకాక ప్రవక్తలు చెప్పిన ప్రతి పదము నెరవేర్చబడుచుండుట అందరికీ

తెలియుచున్నది. ఎదురుగా జరుగుచున్ననూ గుర్తించలేని వారు ఎప్పుడో జరుగుతుందని అనుకొని పొరబడుచున్నారు.

జనన మరణములు సృష్టి ఆదినుండి ఉండినప్పటికీ, అప్పటినుండి వున్న హిందూమతములో గతములోనున్న గొప్ప గొప్ప మహర్షులుగానీ, నేడు ఎంతో గొప్ప స్వామీజీలుగా పేరుగాంచిన వారుగానీ, జనన విషయమునే సరిగా అర్థము చేసుకోలేక పోయి, గర్భములోని ఐదవ నెల శిశువుకే ప్రాణమున్నదనీ, గర్భములోనే అన్ని జ్ఞాపకములున్నవనీ, బయటి విషయములను కూడా వినగలుగుచున్నాడనీ, ప్రహ్లాదుడు నారదమహర్షి చెప్పిన నారాయణ మంత్రమును వినగలిగాడనీ, అట్లే అర్జునుడు, అతని భార్య సుభద్ర మాట్లాడుచుండగా, గర్భములోని అభిమన్యుడు యుద్ధ తంత్రములను వినగలిగాడనీ చెప్పడము తెలిసిన విషయమే. ఈ విధముగా ముందే ప్రజలలో జనన మరణములను గురించిన ధర్మము అధర్మముగా ప్రచారమైపోయినది. అధర్మముగానున్న ధర్మము తిరిగి ధర్మముగా ప్రచారమగుటకు చాలా కష్టమైన పనియగును. అధర్మమైతే ప్రజలకు సులభముగా అర్థముకాగలదు. దానినే ధర్మముగా చెప్పవలసినపుడు వినే వారిలోని మాయ అనవసర ప్రశ్నలనూ, అనుమానములనూ సృష్టించును. చెప్పబడు విషయము సత్యమైనా, అది అసత్యముగా అగుపించునట్లు చేయును. జనన విషయములో ప్రసవింపబడిన శిశువు యొక్క శరీరములోనికి జీవుడు చేరుననుట సత్యమూ, ధర్మమూ, ప్రత్యక్ష ప్రమాణము అయినా, అది అన్ని విధముల శాస్త్రబద్ధముగా ఉండినా, దానిని మనిషి నమ్మశక్యము కానిదిగా భావించుకొనును. దానిని గురించి ఏమాత్రము విచక్షణా జ్ఞానమును ఉపయోగించడు. అదే విషయమును అధర్మముగా చెప్పితే, అది ఏమాత్రము సత్యము కాకున్నా, ప్రత్యక్ష ప్రమాణము కాకున్నా దానిని సులభముగా నమ్మడము జరుగుచున్నది. కర్ణుడు చెవిలో పుట్టాడనినా, ద్రోణుడు కుండలో

పుట్టాడనినా దానిని సులభముగా నమ్మేస్తారు. అవి ధర్మవిరుద్ధమైన మాటలని ఎవరూ అనుకోరు. ఆ విషయములో ఎటువంటి అనుమానములూ రావు. అదే జన్మ విషయమును ధర్మయుక్తముగా శిశువు తల్లిగర్భమునుండి బయటపడిన తర్వాత జీవునికి జన్మ కలుగుచున్నదని చెప్పితే, అది నూరు పాళ్ళు సత్యముగా ఉండినా, మనిషి విజ్ఞానవంతుడైనా నమ్మలేక పోవు చున్నాడు. అనవసరమైన అనుమానములతో సత్యమునకు దూరమై పోవుచున్నారు. పూర్తి విచక్షణా దృష్ఠితో చూడకుండానే ఒక నిర్ణయానికి వచ్చి సత్యమును అసత్యమనుకొనుచున్నారు. ఇది హిందూమతములోని అధర్మముకాగా, ఇతర మతములలో కూడా మాయ లేక సాతాన్ (సైతాన్) అనునది ప్రవక్తలు చెప్పిన దేవుని ధర్మములను ప్రజలకు అధర్మములుగా అర్థమగునట్లు చేసింది. దేవుని జ్ఞానమును పూర్తిగా అర్థము కాకుండ చేసి అజ్ఞానులుగా ఉండునట్లు చేసింది.

ఒక్క హిందూమతములోనే కాకుండా ఇతర మతములలోని మనుషులను కూడా దేవునివైపు పోకుండా, దేవుని జ్ఞానము అర్థము కాకుండా చేయడములో అహర్నిశలు మాయ పని చేస్తూనేవున్నదని చెప్పుటకు ఎన్నో తార్కాణములు గలవు. పవిత్ర ఖురాన్ గ్రంథములో మక్కాలో అవతరించిన **"అబస"** అను సూరాయందు (అధ్యాయమందు) 37 ఆయత్‌లో (వాక్యములో) ఇలా గలదు. **"ఆ రోజు ఆసన్నమైనపుడు ప్రతి ఒక్కరికీ తన మీద సృహతప్ప ఎవరిమీద సృహ ఉండదు."** ఈ వాక్యమును అనుసరించి హదీసుల్లో విభిన్న క్రమాల ద్వారా, ప్రమాణముల ద్వారా అందిన ఒక ఉల్లేఖనం కానవస్తుంది. అందులో ప్రవక్త మహానీయులు (స) **"ప్రళయదినాన అందరు ఒక్క నూలు పోగైనా గుడ్డలు లేకుండా నగ్నముగా లేపబడతారు."** అని చెప్పినపుడు ఆయన సతీమణులలో ఒకరు బహుశ నాల్గవ భార్య

అయిన హజ్రత్ అయిషా ఖంగారుగా **"దైవ ప్రవక్తా! ఆనాడు మా గోపనీయ అవయవాలు అందరిముందు బయటపడతాయా?"** అని ప్రశ్నించారు. అప్పుడు దైవ సందేశహరులు (స) ఈ 37వ ఆయత్‌నే పఠించి **"ఆ రోజున ఎవరికీ మరొకవైపు చూచే స్పృహ ఉండదు"** అని పలికారు. దైవసందేశాన్ని తెలిపిన మహమ్మద్ ప్రవక్తగారు చెప్పిన పై వాక్యమును విడదీసి చూచుకొనిన ఈ విధముగా అర్థము కాగలదు. ప్రళయ దినము అనుటలో ప్ర అనగా పుట్టినది అని అర్థము. అలాగే ళయము అనగా నాశనము అని అర్థము. మొత్తానికి ప్రళయము అనగా పుట్టినది నాశనమగుట అని తెలియుచున్నది. పుట్టినది నాశనమగుట అని తెలిసినపుడు పుట్టినది ఏది అని ప్రశ్న రాగలదు.

ఆ ప్రశ్నకు రెండు జవాబులు కలవు. ఒకటి సృష్టి ఆదిలో సృష్టికర్త అయిన దేవుడు పంచభూతములైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు ప్రకృతి భాగములను సృష్టించాడు. రెండవది, జీవముతో కూడు కొనిన శరీరమును ధరించిన జీవరాసులను కూడా సృష్టించాడు ఒకటి మార్పు చెందని ప్రకృతియనీ రెండవది మార్పు చెందు ప్రకృతి అని చెప్పబడు చున్నది. వీటినే చరాచర ప్రకృతి అని కూడా అనుచున్నారు. పంచ భూతములు మార్పుచెందని ప్రకృతియనీ, జీవరాసులు మార్పుచెందు ప్రకృతియనీ కూడా చెప్పడము జరిగినది. దీనినిబట్టి దైవసృష్టి రెండు రకములనీ, ఒకటి జీవరాసులు లేని ప్రపంచమనీ, రెండవది జీవములున్న శరీరములనీ తెలియుచున్నది. సృష్టించబడినవి జీవమున్న మరియు జీవములేని రెండు రకముల ప్రకృతులైతే, అవి నాశనము చెందడము కూడా (వాటి ప్రళయములు కూడా) రెండు రకములుగా కలవు. రెండు రకముల ప్రళయములను తెలుసుకొనే ముందు రెండు రకముల ప్రభవములను (పుట్టుకలను) కూడా వివరముగా తెలిసివుండాలి.

కనిపించే విశ్వమును రెండుగా విభజించవచ్చును. అవియే చరా చర ప్రకృతులని చెప్పబడుచున్నవి. ఒకటి జీవములేని ప్రకృతి భాగములైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి. రెండవది ఈ ఐదు మూల పదార్థము లతో తయారైన జీవమున్న శరీరములు. జీవములేని ప్రకృతి మరియు జీవమున్న ప్రకృతి రెండూ ఆదిలోనే దేవుని చేత సృష్ఠింపబడినవి. ఈ రెండిటికీ సృష్ఠికర్త దేవుడే. ఇందులో జీవములేని ప్రకృతి ఒక్కమారే సృష్ఠింప బడుచున్నది. ఒకేమారు ప్రళయము పొందుచున్నది. రెండవదైన జీవమున్న ప్రకృతి క్రమబద్ధముగా కర్మననుసరించి ఎన్నోమార్లు పుట్టింప బడుచున్నది. మరియు ఎన్నోమార్లు ప్రళయము పొందుచున్నది. కనిపించే విశ్వములో ప్రత్యక్షముగా జీవమున్న ప్రకృతి అనేకమార్లు నాశనము (ప్రళయమును) చెందుచున్నది, అలాగే అనేకమార్లు సృష్ఠించబడుచున్నది. జీవములేని ప్రకృతి మాత్రము సృష్ట్యాదిలో ఒకేమారు సృష్ఠింపబడి, వేయి యుగముల అనంతరము ఒకేమారు ప్రళయమును పొందుచున్నది. అయితే జీవమున్న ప్రకృతి నిత్యము సృష్ఠింపబడుచున్నది. నిత్యము నాశనమును (ప్రళయమును) పొందుట జరుగుచున్నది. దీనినిబట్టి సృష్ఠి రెండు రకములనీ, ప్రళయములు కూడా రెండు రకములనీ, అన్నిటికీ అదికర్త దేవుడొక్కడేనని తెలియుచున్నది. ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. దైవ సందేశహరులైన హజ్రత్ మహమ్మద్ ప్రవక్త (స) గారు దివ్యఖురాన్‌లో అబస అను 80 సూరాయందు 37 ఆయత్‌లో తెలిపిన వాక్యములో "ప్రళయ దినాన అందరూ" అనుట వలన మనుషులందరికీ అని అర్థమగుచున్నది. మనుషులందరూ జీవమున్న ప్రకృతిలోని భాగము కనుక అబస సురాలో 37 ఆయత్‌లో చెప్పినది మనుషలకు సంబంధించిన ప్రళయమును గురించి మాత్రమేనని తెలియు చున్నది.

దేవుని చేత సృష్టింపబడిన ప్రకృతి రెండు రకములని తెలియక పోతే అందరికి వేలయుగముల తర్వాత జరుగు విశ్వప్రళయము మాత్రమే తెలియును. మనిషి జీవితము యొక్క అంత్యకాలములో జరుగు మరణమను ప్రళయము తెలియకుండా పోవును. మనిషికి కొన్ని పదుల సంవత్సరముల కొకమారు జరుగు శరీర మరణము అనునది కూడా చరా ప్రకృతికి సంభవించు ప్రళయమనీ, అటువంటి ప్రళయములను మనుషులు వారివారి జీవితములలో అనేకమార్లు పొందుచున్నారని చెప్పవచ్చును. మనిషి చనిపోయిన ప్రతిసారీ అతను సమాధి పొందుచున్నాడనీ, తిరిగి సమాధి నుండి లేపపడుచున్నాడనీ, మాక్కాలో పుట్టిన "అల్ ఇన్ఫితార్" అనే 82వ సురాలో 4వ ఆయత్‌లో "సమాదుల్ని తెరిచివేసినపుడు" అని వ్రాయబడిన వాక్యముకు వివరము ఖురాన్ అవగాహన గ్రంథములో ఇలా వ్రాయబడి వున్నది. సమాధులు తెరుచుకోవడము అంటే మనుషులు తిరిగి బ్రతకడము అని అర్థము. ఇస్లామ్ పండితులు వ్రాసిన వాక్యములను బట్టి పవిత్ర ఖురాన్‌లో హజ్రత్ మహమ్మద్ (స) ప్రవక్త చెప్పిన దానినిబట్టి ప్రళయము అనగా విశ్వమంతటికీ సంభవించు ప్రళయముకాదనీ, మనుషులకు సంభవించు జీవిత అంత్య కాలమైన మరణమనీ తెలియుచున్నది. దేవుని చేత సృష్టింపబడిన చరా ప్రకృతీ, అచరా ప్రకృతీ అను రెండు ప్రకృతులలో కేవలము చరా ప్రకృతి అయిన మనుషులకు సంబంధించిన ప్రళయమును గురించే దేవుడు చెప్పాడనీ, అలా మనుషులకు సంబంధించిన ప్రళయమును పొందిన తర్వాతనే మనిషి సమాధిని పొందుచున్నాడని అర్థమగుచున్నది.

చరా ప్రకృతి అయిన మనుషుల మరణానికి సంబంధించిన ప్రళయమనుకోకుండా, విశ్వ అంత్యములో జరుగు అచరా ప్రకృతికి సంబంధించిన ప్రళయముగా అర్థము చేసుకొంటే, ఆ ప్రళయము తర్వాత సమాదులుగానీ, వాటినుండి లేవడముగానీ ఉండదు. ఎందుకనగా! అచరా

ప్రకృతికి సంభవించు ప్రళయము విశ్వప్రళయమగును. విశ్వ ప్రళయము తర్వాత మొత్తము ప్రపంచమే ఉండదు. విశ్వప్రళయము తర్వాత ఇప్పుడున్నది ఏదీ ఉండదు. అచరా ప్రకృతి అయిన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి లేకుండా పోయినపుడు, సర్వసృష్ఠి అంత్యమై పోయినపుడు, దేవుడు తప్ప ఏదీ మిగలనపుడు జీవరాసుల ఉనికిగానీ, వాటి సమాదులుగానీ, తిరిగి వారు బ్రతుకుటగానీ, స్వర్గముగానీ, నరకముగానీ ఉండదు. అందువలన మూల గ్రంథమైన ఖురాన్‌లో చెప్పినది మనుషులకు సంబంధించిన ప్రళయముగా గ్రహించుకోవలెను. మనుషుల అంత్య కాలమునకు సంబంధించిన ప్రళయముగా అర్థము చేసుకోవలెనుగానీ, పంచ భూతములకు సంబంధించిన ప్రళయమని అర్థము చేసుకోకూడదు. మనుషులకు సంబంధించిన ప్రళయములో, జీవుడు శిశు శరీరమును సమాధిగా పొందవచ్చును. ఆ సమాధినుండి లేపబడవచ్చును. కానీ విశ్వప్రళయములో దేవుడు తప్ప ఏదీ మిగలనప్పుడు, జీవుని ఉనికి తెలియకుండా పోయి, శరీరములుగానీ (సమాదులుగానీ) జీవుడుగానీ లేనప్పుడు అటువంటి ప్రళయమును గురించి ప్రస్తావించనవసరమే లేదు. అందువలన పెద్దలు చెప్పినది మనుషులకు సంబంధించిన ప్రళయమని గ్రహించవలెను. ఇప్పుడు ఖురాన్ గ్రంథములో 80 అధ్యాయమున అబస సురాలో 37వ ఆయత్‌లో చెప్పినట్లు ప్రళయ దినము అర్థమై పోయిందను కుంటాను. ఇక 82 సురా అయిన ఆల్ ఇన్‌ఫితార్‌లో 4వ ఆయత్‌లో "సమాధులు తెరచి వేసినప్పుడు" అనగా మనుషులు తిరిగి బ్రతకడము అని ఖురాన్ అవగాహన గ్రంథములో చెప్పబడినది. వాస్తవముగా సమాది తెరవబడినపుడే మనిషి తిరిగి బ్రతుకుచున్నాడనీ లేక సమాది నుండి బయటికి వచ్చినపుడే మనిషి తిరిగి పుట్టగలుగుచున్నాడని మేము కూడా చెప్పుచున్నాము.

ఇక్కడ మనము బాగా అర్థము చేసుకోవలసినది ఏమనగా! ఇదే సురాలో నాల్గవ ఆయత్ చెప్పకముందు ఒకటి, రెండు, మూడు ఆయత్‌లు ఇలా గలవు. 1) ఆకాశము చీలిపోయినప్పుడు 2) నక్షత్రాలు చెదరిపోయి నప్పుడు 3) సముద్రాలు చీల్చివేసినప్పుడు అని మూడు వాక్యములు గలవు. ఈ మూడు ఆయత్‌లలో (వాక్యములలో) చెప్పినది ప్రళయమును గురించియే అయినా అది పంచభూతములకు సంబంధించిన ప్రళయముకాదు. కేవలము పంచభూతముల వలన పుట్టిన జీవరాసుల శరీరములకు సంబంధించిన ప్రళయమని తెలిసిపోవుచున్నది. అది పంచభూతములకు సంబంధించిన ప్రళయమే అయివుంటే ఆకాశమే లేకుండా పోయేది. ఆకాశమే లేకుండా పోయినపుడు నక్షత్రము చెదిరిపోవడమంటూ ఉండదు. చివరి ప్రళయములో ఆకాశమూ ఉండదు, నక్షత్రములూ ఉండవు. పంచభూతములకు ప్రళయమైతే, పంచభూతములలో ఒకటి అయిన సముద్రము యొక్క ఉనికే లేకుండా పోతుంది, కానీ సముద్రము చీలిపోదు. సముద్రము చీలిపోయింది అంటే కొన్ని ఖండములుగా చేయబడింది అనియేగా అర్థము. అప్పటికీ సముద్రము ఉన్నట్లే కదా! అదే విధముగా ఆకాశము కూడా చీలిపోయింది కానీ మొత్తానికి లేకుండా పోలేదు కదా! దీనినిబట్టి అక్కడ చెప్పిన ప్రళయము పంచభూతములైన ప్రపంచమునకు కాదనీ, అది పంచ భూతముల వలన పుట్టిన శరీరములు నాశనమగుటకు ఏర్పడిన ప్రళయమని చెప్పవచ్చును. ఇకపోతే ఇదే వాక్యములనే హదీసు పండితులు వివరించుతూ ఖురాన్ అవగాహన అను గ్రంథములో ఇలా వ్రాశారు.

“81వ అత్‌తక్వీర్ సురాలో ఆరవ ఆయత్‌లో మంటలు చెలరేగు తాయని వుంది. ఇక్కడేమో సముద్రాలు చీలిపోతాయని వచ్చింది. రెండు ఆయత్‌లను సమన్వయపరిస్తే, ఖురాన్ ప్రకారము ప్రళయ దినాన అత్యంత

తీవ్రమైన భూకంపము వస్తుందనీ, అది ఒక ప్రాంతానికి పరిమితమై ఉండదనీ, భూమి యావత్తు కుదుపులకు గురువుతుందని అనుకుంటే, సముద్రాలు చీలి వాటిలో మంటలు ఎలా ఏర్పడగలవో మనకు బోధపడ గలదు. మొదటి ఆ మహా భూకంపము వలన సముద్రాల అడుగు చీలిపోయి సముద్రాల నీరు దాని అంతర్భాగానికి దిగజారి పోతుంది. లోన సతతం అత్యంత వేడిలో లావా సలసల కాగుతూవుంటుంది. ఆ లావా సమీపానికి నీరు చేరగానే దాని మూల పదార్థములుగా విడిపోతుంది. వాటిలో ఒకటి మండించే ఆక్సిజన్, రెండవది మండే హైడ్రోజన్. ఇలా నీరు విడిపోవడము జ్వాలలు రేగడము అన్నది నిరంతర చర్య ప్రతి చర్యగా మొదలవుతుంది. ఫలితంగా సముద్రాలన్నిటిలో మంటలు చెలరేగుతాయి. ఇది మా ఊహ మాత్రమే. నిజ జ్ఞానమైతే అల్లాహ్‌కు తప్ప మరెవ్వరికీ తెలియదు. ఇక్కడ స్పష్టముగా ప్రళయము ఇదేనని చెప్పకుండా, ఈ విషయములు దేవునికి తెలుసు అనడము చాలా మంచిమాట. ఈ మాటను బట్టి చూస్తే గొప్ప జ్ఞానులైన వారుకూడా ప్రళయమును గురించి ఖచ్చితముగా చెప్పలేక పోయారని తెలియుచున్నది. వాస్తవముగా ఒక్క మనుషులకే కాకుండా సమస్త ప్రపంచమునకు, సహస్ర యుగములకు ప్రళయము సంభవించుననీ తర్వాత సహస్ర (వేయి) యుగముల అనంతరము తిరిగి సృష్ఠినంతటిని తయారు చేయుదుననీ దేవుని అంశ అయిన భగవంతుడు బ్రహ్మవిద్యా శాస్త్రములో తెలియజేశాడు. వాస్తవానికి జీవ శరీరములైన ప్రళయమును గురించియే మేము విశదీకరించి చెప్పాము. కానీ ప్రపంచ ప్రళయమును గురించి అది ఎట్లుండునో మేము కూడా చెప్పడము లేదు. చివరి యుగ ప్రళయము ఎట్లుండునో దేవునికి తప్ప ఎవరికీ తెలియదు. చివరి ప్రళయములో మాత్రము సృష్ఠించబడిన సమస్తమూ లేకుండా పోవునని మాత్రము దేవుడే తన శాస్త్రములో తెలియజేశాడు.

పవిత్ర ఖురాన్ గ్రంథములో 81వ అత్ తక్వీర్ సురాలో 7వ ఆయత్ నందు "ఆత్మలు శరీరాలతో ఏకమౌతాయి" అని చెప్పబడివుంది. దానికి వివరము కూడా ఇలా వ్రాయబడివున్నది. **"మానవులు మరణానికి ముందు ప్రపంచములో ఏ ఆత్మ శరీరాలతో పాటు సజీవముగా ఉండేవారో, అదే విధముగా సరిక్రొత్తగా బ్రతికించబడుదురు."** ఈ ఆయత్‌లో పునర్జన్మ విషయమును పూర్తిగా చెప్పినా, అది దేవుడు మనిషిని తిరిగి పుట్టించు చున్నాడని తెలిసినా, ఆ పుట్టుక ఏదో? ఎప్పుడు జరుగుచున్నదో? ఎలా జరుగుచున్నదో మనుషులకు తెలియకుండా పోయినది. దేవుడు అంత వివరముగా చెప్పినప్పటికీ, దేవుడు చెప్పిన విషయము అర్థము కాకుండా పోయి, వేరు విధముగా అర్థమగుటకు కారణము మాయ ప్రభావమని తెలియుచున్నది. మనిషిని దేవునివైపు పోకుండా, దేవుని జ్ఞానము అర్థము కాకుండా చేయడమే మాయ (సాతాన్) యొక్క ముఖ్యమైన పని. కావున మాయ, మనిషిని తన ఆధీనమందుంచుకొని దేవుని జ్ఞానము తెలియకుండా చేయుచున్నది. అందులోని భాగముగా పునర్జన్మ విషయమును అర్థము కాకుండా అపార్థము చేసి పెట్టింది. మాయ యొక్క అపార్థమును వదిలి, దేవుని యొక్క అర్థమును తెలుసుకొనుటకు పవిత్ర ఖురాన్ గ్రంథములో చెప్పబడిన ఆయత్‌లలోని జ్ఞానమును జ్ఞానదృష్థితో వివరించుకొని చూస్తాము.

దేవుని శాసనము ప్రకారము మనిషిగానీ లేక ఏ జీవరాసిగానీ మొదట పుట్టిన తర్వాత అతని జీవితములో బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యము గడచిపోవును. తర్వాత శరీరమును ఆ జీవుడు మరణములో వదలి వేయడము జరుగుచున్నది. బాగా వివరించుకొని చూస్తే ఒక సజీవమైన మనిషిలో ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు ధాతువులతో కూడివున్న ప్రకృతి సంబంధమైన శరీరము ఒక

భాగముగా, అలాగే ఆత్మ సంబంధమైన జీవాత్మ ఒక భాగముగా మొత్తము రెండు భాగములుగా ఉన్నది. ఈ రెండు భాగములలో ఆత్మ సంబంధమైన జీవుడు, ప్రకృతి సంబంధమైన శరీరములో కొంతకాలము నివసించి, ఆ శరీరములో జీవితమును గడిపి చివరకు మరణమును పొందుచున్నాడు. మరణములో జీవాత్మ నివసించిన శరీరము మాత్రము నాశనమై పోవుచున్నది. జీవుడు లేక జీవాత్మ, మరణములో శరీరముతో పాటు నాశనము కావడము లేదు. మరణము అనునది శరీరములోనున్న పంచభూతములకు ప్రళయమును కల్గించుచున్నదనీ, శరీరములో నివసించిన జీవాత్మకుకాదనీ తెలియుచున్నది. శరీర రూపములోనున్న ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి ప్రళయము పొందినపుడు అది మరణమగును. **మరణము శరీరములో జరుగు ప్రళయమును మాత్రమే తెల్పుచున్నది.** శరీరములోనున్న సముద్రము సముద్రముగా ఉండక అది చీలిపోయినపుడు, శరీరములోని అగ్ని సాధారణముగా ఉండక అది సముద్రమును కూడా మండించినపుడు, శరీరములోని భూమి శాంతముగా ఉండక కంపించినపుడు, అలాగే శరీరములోనున్న ఆకాశము ప్రశాంతముగా ఉండక రెండుగా చీలి పోయినపుడు, శరీరములోని గాలి సాధారణము ఉండకుండా చెలరేగి పోయి విపరీతమైన శబ్దమును పుట్టించినపుడు, నక్షత్రములు గాలికి కొట్టుకు పోయినపుడు, జీవుడు అటువంటి ప్రళయము పొందిన శరీరములో ఉండక బయటికి వచ్చును, అదియే మరణము. ఇటువంటి ప్రళయమునే అల్లాహ్ (దేవుడు లేక పరమాత్మ) అల్ ఇన్ ఫితార్ 82వ సురాలో 1,2,3 ఆయత్‌లలోనూ, 81వ సురా అయిన అత్ తక్వీర్‌లో 1,2,3 ఆయత్‌లలోనూ, 80 నంబర్ సురా అయిన అబస సురాలో 37 ఆయత్‌లోనూ హజ్రత్ మహమ్మద్ (స) ప్రవక్త ద్వారా పవిత్ర ఖురాన్‌లో చెప్పించారు.

80వ అబస సురాలో 21వ ఆయత్‌నందు "తరువాత మృత్యువు నిచ్చాడు, సమాధికి చేర్చాడు." అని కూడా ఉంది. అలా ఎందుకు చెప్పారు అనగా మనిషి జీవితము కొంతకాలము సాగిన తర్వాత శరీరము నాశనమై మృత్యువు ఏర్పడుచున్న విషయము ప్రత్యక్ష సత్యము. దేవుడు చెప్పినట్లు ప్రత్యక్షముగా అందరికీ తెలియునట్లు మరణము సంభవించిన తర్వాత శరీరమును వదలిన జీవుడు (జీవాత్మ) ఏమౌతున్నాడు? అను ప్రశ్నకు జవాబుగా మృత్యువునిచ్చిన దేవుడే, సమాధికి కూడా చేర్చాడు అను విషయము అబస సురాలో 21 ఆయత్‌లో చెప్పడము జరిగినది. ఇక్కడ వివరించుకొని చెప్పుకొంటే, ఒక మనిషి యొక్క మరణము అందరికీ తెలియుచున్నది. తర్వాత విషయమే ఎవరికీ తెలియదు. అయితే మాకు తెలిసినదేమనగా! మనిషి మరణించిన తర్వాత మరణించిన శరీరములోని జీవాత్మ వెంటనే క్రొత్తగా తయారై, తల్లిగర్భమునుండి ప్రసవింపబడిన శిశు శరీరములోనికి చేరుచున్నది. అన్ని రకములా గ్రుడ్డివాడైన జీవుడు స్వయముగా ఒక్కనిగా శిశు శరీరములో చేరడము లేదు. సృష్ఠి ఆదినుండి తనతో కూడా శరీరములో ఉన్న ఆత్మతో కలిసి, జోడుగా పోయి క్రొత్త శిశు శరీరమును చేరుచున్నాడు. క్రొత్త శరీరమును చేరడములో జీవాత్మతో పాటునున్న ఆత్మ మార్గదర్శకమవుచున్నది. అలా మృత్యువు తర్వాత ఒక్క సెకండు కూడా ఆలస్యము లేకుండా జీవాత్మ క్రొత్త శరీరమును చేరడమునే అబస సురాలో 21వ ఆయత్‌నందు **"మృత్యువు నిచ్చాడు, సమాధికి చేర్చాడు"** అని ఉన్నది. జీవుడు ఆత్మతో పాటు క్రొత్త శిశుశరీరమును చేరినపుడు, ఆ జీవుడు సమాధికి చేరినట్లు చెప్పబడినది. దీనినిబట్టి సమాధి అనగా! తల్లి గర్భమునుండి పుట్టిన శిశు శరీరమని తెలియుచున్నది. ఒకమారు మరణించిన జీవుడు అనగా శరీరమును వదలిన జీవుడు రెండవమారు సమాధినుండి లేపబడుచున్నాడు. శిశుశరీరమే సమాధి

అని చెప్పుకొన్నాము కదా! జీవుడు మరియు జీవునితో కూడాయున్న ఆత్మ రెండూ శరీరములో నిక్షిప్తమైవుండడమును సమాది చేయబడిన జీవునిగా చెప్పుకొన్నాము. సృష్ఠి ఆదినుండి జీవరాసుల పుట్టుక విషయములో సమానముగా అందరికీ వర్తించునది, కావున దీనిని సమాధి లేక సమాది అని చెప్పుకొన్నాము. ఒక మనిషియొక్క జీవిత ప్రారంభములో శిశు శరీరము లేక క్రొత్త శరీరమను సమాధినుండి మనిషి లేపబడుచున్నాడు.

ఇక్కడ సమాధినుండి లేపబడడము అనగా! శిశుశరీరములోనికి చేరి నిక్షిప్తమైయున్న జీవున్ని, తిరిగి ప్రపంచ మెలుకువలోనికి తేవడమేనని అర్థము. ప్రతిదినము మనము నిద్రపోవువానిని లేపుచున్నాము కదా! అట్లే మొదట శిశుశరీరములోనున్న జీవున్ని బయట ధ్యాసలోనికి తేవడమును సమాధినుండి లేపడము అని చెప్పవచ్చును. ప్రతి దినము మనిషి నిద్రలోనికి పోయి శరీరమందు నిక్షిప్తమై పోవుచున్నాడు. అలాంటి మనిషిని శరీరము నుండి మరియొక మనిషి లేపవచ్చును. అయితే జీవితము ప్రారంభములో అనగా మొట్టమొదట లేపువాడు దేవుడేనని జ్ఞాపకముంచకోవలెను. ఆదిలో లేపడమునే సమాధి అనుచున్నాము. తర్వాత జీవితములో ఎప్పుడు లేచినా నిద్రనుండి లేవడమే జరుగుచున్నది. నిద్ర కూడా అందరికీ సమమే అయినా నిద్రనుండి లేవడము కూడా అందరిలో సమానముగానే ఉండినా, అది ఆదిలో జరిగే పనికాదు. కావున సమాదినుండి లేవడము అని అనలేము. జీవితములో మొదట లేపబడిన తర్వాత ఎప్పుడు లేచినా, ఎవ్వరు లేపినా అది నిద్రనుండి లేవడమేగానీ, సమాధినుండి లేచినట్లు కాదు. జీవితము మొదటి భాగములో శిశు శరీరమే సమాధి, ఆదిలో లేపబడడమే సమాధినుండి లేపబడడము అని చెప్పవచ్చును. అంతేకాక జీవితములో నిద్రనుండి ఎవరైనా లేపవచ్చును. కానీ ఆదిలో శిశుశరీరమునుండి ఎవరినీ ఎవరూ లేపలేరు. అది ఒక్క దేవునికి మాత్రమే సాధ్యము.

ఒక మనిషిని దేవుడు సృష్ఠించాడు, అతనికి జీవితాన్నిచ్చాడు, మృత్యువునూ ఇచ్చాడు, తర్వాత సమాధికి చేర్చాడు. తిరిగి సమాధినుండి లేపాడు. దీనిని ఏ మనిషీ కాదనలేడు. దీనినే భగవద్గీతలో పుట్టినవాడు చావక తప్పదు, చచ్చినవాడు పుట్టక తప్పదని దేవుడు చెప్పడమేకాక మనిషికి బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యము తర్వాత మరణము తప్పదని కూడా చెప్పాడు. ఇదే విషయమునే పవిత్ర ఖురాన్ గ్రంథములో కూడా అబస సురాలో 19,20,21,22 ఆయత్‌లలో "అల్లాహ్ అతనిని పుట్టించాడు, అతని భాగ్యాన్ని (కర్మను) నిర్ణయించాడు. తర్వాత అతని జీవన మార్గాన్ని సుగమం చేశాడు. తర్వాత మృత్యువునిచ్చాడు, సమాధికి చేర్చాడు. తిరిగి ఆయన (దేవుడు) మనిషిని సమాధినుండి లేపి నిలబెడతాడు." ఈ విషయమును దేవుడు పూర్తిగా బహిర్గతము చేసి చెప్పినప్పటికీ, అందరికీ ప్రత్యక్ష ప్రమాణముగా కనిపిస్తున్నప్పటికీ, మాయ ప్రభావము చేత ఇదే విషయము అత్యంత రహస్యముగా మారిపోయినది. అంతేకాకుండా వక్రమార్గములో అర్థమైనది. సమాధి అంటే చనిపోయిన మనిషిని పూడ్చి పెట్టునది లేక కప్పిపెట్టునది అని అనుకొంటున్నారు. మనిషి మృత దేహమును పూడ్చిపెట్టునది గోరీ అనబడును, కానీ సమాధి అనబడదు. **శరీరమును కప్పివుంచునది గోరీ, జీవున్ని కప్పివుంచునది సమాధి అని తెలియవలెను.**

మృత్యువు నిచ్చాడు, సమాధికి చేర్చాడు అను ఆయత్‌ల ప్రకారము మనిషి మరణించిన తర్వాత క్రొత్త శిశు శరీరానికి చేర్చబడుతాడని అర్థమగు చున్నది. అలా సమాదికి చేర్చబడినవాడు ఆ శరీర సమాధినుండి లేపబడు చున్నాడు. సమాధినుండి లేపడము ఎవరిని అని ప్రశ్నించుకొంటే, చైతన్య ఆత్మ సంబంధమైన జీవాత్మనని తెలియుచున్నది. శిశు శరీరము లోతులలో

చేరిన జీవున్ని బయట ధ్యాసలలోనికి లేపడమే, జీవున్ని సమాదినుండి లేపడమని తెలియవలెను. అంతేకాక అలా లేపబడిన జీవుని శరీరము ఎలా ఉండుననగా అత్ తక్విర్ సురాలో 7వ ఆయత్‌లో చెప్పినట్లు ప్రళయము తర్వాత "ఆత్మలు (శరీరములో) ఏకమైనపుడు అనగా మానవుల మరణానికి ముందు ప్రపంచములో ఏ ఆత్మ శరీరాలతో సజీవంగా ఉండేవాడో అదే విధముగా సరికొత్తగా వారు బ్రతికించబడతారు. అని హదీసు పండితులు చెప్పినట్లు, మనిషి చనిపోకముందు ఎటువంటి శరీరముతో ఉండేవాడో అటువంటి ఎముకలు, రక్తము మాంసమున్న శరీరములోనే బ్రతికించ బడుతాడు. కొందరు క్రొత్తగా బ్రతికించబడు శరీరమును గురించి కూడా పొరపాటుపడ్డారని, అటువంటి వారు మనిషి చనిపోయిన తర్వాత పాత శరీరమునే జీవుడు తిరిగి పొందుచున్నాడని అనుకొనుచున్నారు, అది పొరపాటు. ఎందుకనగా! మనిషి మరణించిన తర్వాత మృతదేహము శిథిలమై పూర్తి కనిపించకుండా పోవుచున్నది. అది పంచభూతములైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమితో కలిపోవుచున్నది. తిరిగి క్రొత్త శరీరమును సమాధిగా జీవుడు పొందిన, అది పంచభూతములతో తయారైనదై ఉండును. మరియు మొదటి శరీరములోనున్న రక్తమున్నట్లే రక్తముండును. అట్లే పాత శరీరములో ఉన్నట్లే ఎముకలు, కండలు ఉండును. కానీ అవి క్రొత్తవిగా ఉండును. పాతవన్ని ప్రళయములో (మరణములో) పోయి తిరిగి క్రొత్తవి, జన్మలో కలుగుచున్నవి. ప్రవక్తగారు అదే శరీరముతో లేపబడుదురు అన్నపుడు, ఆ శరీరము పాత దానివలె అన్నీ ఉండునదని అర్థము. కానీ కుళ్ళిపోయి నాశనము చెందిన శరీరము కాదని తెలియవలెను. దేవుడు ఎన్ని శరీరములనైనా నాశనము చేయగలడు. అట్లే ఎన్ని క్రొత్త శరీములనైన సృష్ఠించనూ గలడు. ఆయన సర్వశక్తి సంపన్నుడు, ఏదైనా చేయగలడు. క్రొత్త శరీరములను సృష్ఠించు స్థోమతగల

దేవుడు నాశనమైన శరీరముల జోలికి పోడు. క్రొత్తది సృష్టించగల దేవుడు పాతదానిని తిరిగి సరిచేయవలసిన (రిపేరు చేయవలసిన) అవసరము లేదు. అందువలన పాత శరీరములవలెనున్న క్రొత్త శరీరములలో తిరిగి మనిషిని లేపగలుగుచున్నాడు. క్రొత్త శరీరమే సమాధి. జీవితములో మనిషికి మొదటి జ్ఞప్తియే సమాధినుండి లేవడము. మనిషి శరీరము నశించడమూ, చనిపోవడమూ, తిరిగి క్రొత్త శరీరముతో పుట్టడమూ జగతిలో ప్రత్యక్షముగా జరుగుచున్న సత్యము. దేవుడు సత్య స్వరూపుడు. కావున దేవుని మాట ప్రత్యక్ష ప్రమాణము, అందువలన దేవుడు చెప్పినది ఏదైతేవుందో అది జరుగుచున్నది. జరుగుచున్న విషయమును విశదీకరించుకొని చూచినప్పుడు అందులో దేవుడు చెప్పిన సత్యము తెలియుచున్నది. భూమిమీద ఎందరో పుట్టి తమ గతజన్మలోని సంగతులను చెప్పగలుగుచున్నారు. దానినిబట్టి మనిషికి ప్రత్యక్షముగా పునర్జన్మలున్నవని తెలియు చున్నది. పునర్జన్మలో ప్రత్యక్షముగా దేవుడు చెప్పినట్లు, శరీర సమాదినుండి మనిషి లేవడము కూడా జరుగుచున్నది. మళ్ళీ పుట్టినపుడు మనిషికి క్రొత్త శరీరము కూడా వచ్చినట్లు అందరికీ తెలియుచున్నది. మన ఎదుటే జరుగుచున్న, దేవుడు చెప్పిన సత్యమును గ్రహించుకోలేక, ఇప్పుడు కాదు ఎప్పుడో జరుగుతుందను కోవడము పొరపాటు. ఎప్పుడో జరుగునని చెప్పడము వలన దేవుని మాటను మభ్యపరచడమే అగును. దానివలన అది సత్యమో అసత్యమో అను అనుమానము కూడా రాగలదు. జరుగుచున్న సత్యమును గమనించని వాడు నిజముగా కళ్ళున్న గ్రుడ్డివాడగును. జ్ఞాననేత్రము లేనివాడగును.

**పవిత్ర ఖురాన్ గ్రంథములోగానీ, పరిశుద్ధ బైబిలు గ్రంథములోగానీ, పరమ పవిత్ర పరిశుద్ధ భగవద్గీతలోగానీ** ప్రవక్తలు చెప్పిన మాటలు దేవుని వాక్యములే అయినా, ఆ వాక్యములు మనిషికి సరిగా అర్థము కాకుండా

పోయాయి. అందువలన చెప్పినది ఒకటయితే మనిషి అర్థము చేసుకొన్నది మరొకటగుచున్నది. అలా అర్థము చేసుకోవడము వలన దేవుని సందేశము మూల గ్రంథముల రూపములో మనముందే ఉండినప్పటికీ, అందులోని సత్యము మనము పూర్తిగా అర్థము చేసుకోలేక పోయాము. దేవుడు చెప్పిన కొన్ని విషయములే మనిషికి అర్థమైవుండవచ్చును. కానీ అన్ని వాక్యములు అర్థము కాలేదని చెప్పవచ్చును. అలా ఎందుకు జరుగుచున్నది? దేవుడు చెప్పినా మనిషి ఆ విషయములను పూర్తిగా ఎందుకు గ్రహించుకోలేక పోతున్నాడు అని యోచిస్తే తెలియునది ఏమనగా! దేవుడు మనిషిని పుట్టించకముందే ప్రకృతిని పుట్టించాడు. తర్వాత మనిషినీ, జీవరాసులనూ పుట్టించాడు. పరమాత్మ (దేవుడు) వలన పుట్టిన ప్రకృతి ఐదు భాగములుగా విభజింపబడినది. ఆ ఐదు భాగముల ద్వారా మనిషి శరీరము తయారైనది. మనిషి శరీరములో పరమాత్మకు సంబంధించిన ఆత్మ, జీవాత్మ అను రెండు ఆత్మలు నివసిస్తున్నవి. పరమాత్మతో కూడా అయితే మనిషి శరీరములో మూడు ఆత్మలు నివసించినట్లగును. దీనిప్రకారము ఒక సజీవ మనిషి శరీరములో మూడు ఆత్మలు, ఐదు ప్రకృతి భాగములు నివసిస్తున్నవి. కానీ మూడు ఆత్మలలో దేవుడైన పరమాత్మను లెక్కించుకోకుండ చెప్పుకోవడము ధర్మము. కావున ఒక శరీరములో జీవాత్మ, ఆత్మలను మాత్రమే చెప్పుకోవలసి వస్తున్నది. ప్రకృతి చేత పుట్టినది శరీరములో ముఖ్యమైనది మరొకటున్నది అదియే మాయ (సాతాన్) లేక సైతాన్ అని పిలువబడుచున్నది. మరణములో శరీరము నశించినా, జీవాత్మ ఆత్మలు నశించక తిరిగి ఎలా జన్మిస్తున్నవో, అలాగే మాయ కూడా శరీరము ప్రళయములో నాశనము చెందక, జీవునితో పాటు ప్రయాణించి క్రొత్త శరీరమును చేరుచున్నది.

ఇక్కడ ముఖ్యముగా గమనించవలసిన విషయమేమనగా! పరమాత్మ తన సృష్ఠిని సృష్ఠించినపుడు మొట్టమొదట ప్రకృతిని సృష్ఠించాడు.

ఆ ప్రకృతి ద్వారా జీవరాసుల శరీరములను సృష్ఠించాడు. ప్రకృతి ద్వారా తయారైన శరీరములు మరణములో నాశనమును పొందినా, ప్రకృతి మాత్రము నాశనము కాకుండా మిగిలివున్నది. సృష్ఠి ఆదినుండి సముద్రములు, భూమి, ఆకాశము, అగ్ని, గాలి ఎట్లున్నవో సృష్ఠి అంత్యము వరకు అట్లే వుండును. సృష్ఠి అంత్యమైన మహా ప్రళయములో ప్రకృతి నశించిపోవును. మహా ప్రళయములో కూడా నాశనముకాని వాడు దేవుడు ఒక్కడే. ఇటు ప్రపంచమున్నపుడుగానీ, అటు ప్రపంచము లేనపుడుగానీ ఏకస్థాయిగా ఉన్నవాడు దేవుడు ఒక్కడే. ప్రపంచము సృష్ఠింపబడిన తర్వాత శరీరములు ఎన్నిమార్లు నాశనమైనాగానీ, జీవుడు ఎన్నిమార్లు తిరిగి పుట్టినా గానీ ప్రకృతి నాశనముకానట్లే, ప్రకృతి జనితమైన మాయకూడా నాశనము కాకుండ ఉన్నది. ప్రకృతిని విభజించి చూస్తే ఐదు భాగములుగా ఉన్నట్లు, మాయను విభజించి చూస్తే మూడు భాగములుగా ఉన్నది. మహా ప్రళయము వరకు నాశనము కాకుండా ఐదు భాగముల ప్రకృతి ఎలా ఉన్నదో, అలాగే మహాప్రళయము వరకు మూడు భాగముల మాయ నాశనము కాకుండా ఉంటుంది.

తనకు ప్రత్యర్థిగా ఉండుటకు దేవుడే స్వయముగా మాయను సృష్ఠించాడు. దేవునికి వ్యతిరేఖముగా నడుచునట్లు దేవుడే మాయను అజ్ఞాపించాడు. దేవునిచేత సృష్ఠింపబడిన మాయ దేవునికి సర్వకాలములందు విధేయత, వినమ్రత కల్గినదై దేవుని ఆజ్ఞను తప్పనిసరిగా పాటిస్తూవున్నది. దేవుడు పురుషుడుకాగా ప్రకృతి స్త్రీగావున్నది. స్త్రీలింగమైన ప్రకృతి చేత దేవుడు పుట్టించిన మాయ కూడా స్త్రీతత్త్వముగానే చెప్పబడుచున్నది. దేవుని ఆజ్ఞచేత ప్రకృతికి పుట్టిన మాయ సృష్ఠ్యాదినుండి దేవుని ఆజ్ఞ ప్రకారము దేవునికి వ్యతిరేఖముగా నడుస్తూ ప్రజలను నడిపిస్తున్నది. మాయ ప్రజలను

ఎలా నడిపిస్తున్నదనగా! మాయ అనునది మూడు భాగములైన గుణములుగా మనిషి తలలో తిష్టవేసుకొని ఉన్నది. తన గుణములయందే జీవున్ని నివసించునట్లు చేసుకొన్నది. సాత్త్విక, రాజస, తామస గుణ భాగములైన మాయ మానవున్ని దేవునివైపు పోకుండా చేయుటకు తన పని తాను చేయుచున్నది. దేవుడు తన ప్రవక్తల ద్వారా తన జ్ఞానమును మహా గ్రంథములనుండి చెప్పించితే, మాయ మాత్రము తన గుణముల ద్వారా తన భావమును మనుషులకు అంటగట్టుచున్నది. ఒక ప్రవక్త ద్వారా ఒక దేవుని ధర్మమును చెప్పించితే, అది మాయ ప్రభావము వలన వేరు విధముగా అర్థమైపోవుచున్నది. అందువలన దేవుని జ్ఞానము పూర్తిగా ఎవరికీ అర్థము కాకుండా పోయినది. దేవుడు ఒక భావముతో చెప్పితే దానినే మాయ మరొక భావముతో అర్థమగునట్లు చేయుచున్నది. అందువలన భగవద్గీత హిందువులకు (ఇందువులకు), బైబిలు క్రైస్తవులకూ, ఖురాన్ ముస్లీమ్‌లకూ పూర్తిగా దేవుడు చెప్పిన భావము ప్రకారము అర్థము కాలేదని చెప్పవచ్చును.

భూమిమీద ఏ మతస్థునికైనా గానీ తలవుంటుంది. ఆ తలలో త్రిగుణ రూపములో మాయ వుంటుంది. ఏ మతస్థుడైనా గానీ సాతాన్ లేక సైతాన్ అనబడు మాయను దాటి దేవుని వైపు పోవాలంటే చాలా దుస్సాధ్యము. ఈ మాట నేను చెప్పునది కాదు. భగవద్గీతలోని వాక్యమే ఇలా ఉన్నది. *"గుణమయీ మమ మాయా దురత్యయా"* గుణములతో కూడుకొన్న నా మాయ దుస్సాధ్యమైనది అని చెప్పబడినది. మూల గ్రంథములోనే మాయ దుస్సాధ్యమైనదని చెప్పినపుడు దానిని జయించుట సులభము కాదు. మాయ మనిషిలో ఉండి ఎవరిచేతా గుర్తింపబడకుండా మసలుకొంటూ, నీవు దేవుని మార్గములోనే ఉన్నావు అనునట్లు నమ్మించి అందరిని తన మార్గములో నడుపుకొనుచున్నది. మేము పెద్ద జ్ఞానులము

అనుకొను వారు కూడా మాయ భావములో పడి, దానినే దేవుని భావముగా తలచుట వలన, దేవుని భావము తెలియకుండా పోయినది. మనము ఇంతవరకు చెప్పుకొన్న పునర్జన్మ విషయములోగానీ, సమాధి విషయములో గానీ మాయ ప్రభావము చేత దేవుని భావము కప్పబడి పోయినందు వలన సమాధి మృత శరీరమునకనీ, పునర్జన్మలు లేవనీ, ప్రళయము అనేక యుగముల అంత్యములోనని తప్పుగా అర్థము చేసుకొన్నారు. మాయ మిమ్ములను మభ్యపెట్టినదని మేము (నేను+నా ఆత్మ) చెప్పినా, మాయ వారికి మమ్ములను తప్పుగా చూపించి, మా మాటను ఏమాత్రము వినకుండా చేయుచున్నది. ఎవనికి వాడు స్వచ్ఛమైన దైవమార్గములో ఉన్నట్లు, మాయ భ్రమింప చేయుట వలన ధర్మములు, అధర్మములుగానే మిగిలి పోవుచున్నవి. అధర్మములను నాశనము చేసి తిరిగి ధర్మములుగా మార్చు పనిని దేవుడే చేయవలెను, కానీ మనుషులైన మాబోటి వారితో కాదు.

మాయ దేవుని గొప్పతనమును తగ్గించు భావములను దైవమార్గము లో గొప్ప జ్ఞానులమనుకొన్న వారిచేతనే చెప్పించగలుగుచున్నది. దేవుని మీద పూర్తి విశ్వాసముతో దేవునికి ఎల్లప్పుడు విధేయులుగా ఉన్నామనుకొను వారిచేత వారికి తెలియకుండానే దేవుని మీదనే అనుమానము వచ్చునట్లు, దేవుని గొప్ప తనమును తగ్గించునట్లు చెప్పించుచున్నది. ఒకచోట దేవుడు చెప్పిన మాట విలువను తగ్గించునట్లు దానికి వ్యతిరేఖమైన మాటను దైవజ్ఞానుల మనువారిచేతనే చెప్పించుచున్నది. ఈ విధముగా ఎందరో జ్ఞానులు మాయ ప్రభావములో ఉంటూ వెనుక ముందు ఆలోచించకుండా దేవుని జ్ఞానమును గురించి చెప్పుచున్నారు. అలా చెప్పుట వలన వారు చెప్పినమాట దేవుడు ముందు చెప్పిన వాక్యమునకు విభిన్నముగా ఉండును. అలాగే వెనక జరుగు ప్రత్యక్ష సంఘటనకు కూడా భిన్నముగా ఉండును.

అయితే అటువంటి ధ్యాసలేకుండా మాయ, మనిషి చేత తన భావమునే చెప్పించుచున్నది. దేవుని భావము, తన భావము ఒక్కటేనని అందరినీ భ్రమింపజేయుచున్నది. ఈ విషయము మీకు బాగా అర్థము కావాలంటే ఒక దైవజ్ఞాని దైవత్వమును బోధించునపుడు ఇది దేవుని జ్ఞానమేనని అతనిని నమ్మించి ఎలా చెప్పించుచున్నదో ఉదాహరణకు చూడండి.

ఈ విషయమును చెప్పేదానికంటే ముందు మేము ఈ దినము (18.09.2011) నేషనల్ జియోగ్రఫి టీవీ ఛానల్‌లో ఒక ప్రొగ్రామ్‌ను చూచాము. అది "టెన్ ఇయర్స్ ఆఫ్ ఒసామాస్ టెర్రర్" (Ten Years Of Osama's Terror) అను ప్రోగ్రామ్‌లో ఇరాక్ టెర్రరిస్టులు ఐదుమంది ఒకచోట నిలబడి ఉన్నారు. ఐదుమంది ఉగ్రవాదులు నల్లని దుస్తులు ధరించి ముఖానికి ముసుగులు కూడా ధరించియున్నారు. ఆ ఐదుమందికి ముందర రోజ్ కలర్ దుస్తులు ధరించిన వ్యక్తి కూర్చొని ఉన్నాడు. ఐదుమంది నిలబడియున్న ఉగ్రవాదులు ఇరాక్ దేశమువారు కాగా, వారిముందర కూర్చునివున్న వ్యక్తి అమెరికా దేశస్థుడు. యాత్రికునిగా వచ్చిన అమెరికా పౌరున్ని ఇరాక్ ఉగ్రవాదులు బంధించి తమవద్ద పెట్టుకొన్నారని అర్థమైనది. అక్కడ ఇరాక్ ఉగ్రవాదులు తమకు అమెరికా దేశము శత్రుదేశమనీ, ఆ దేశము మీద ఉన్న వ్యతిరేఖతతో ఈ అమెరికా పౌరున్ని శిక్షించుచున్నామని, దానితో తమ ఉగ్రవాదము యొక్క బలమేమిటో అమెరికాకు తెలుస్తుందని చెప్పి, ఒకమారుగా తమ ముందు కూర్చున్న అమెరికా పౌరున్ని ప్రక్కకు త్రోచి అతనికి శిరచ్ఛేదము చేశారు. ఆ దృశ్యమును వారు వీడియో తీసి అమెరికాకు పంపారు. అదే దృశ్యమునే టీవీలో చూపడము జరిగినది. ఆ దృశ్యమును నేను ఒక్కడినే కాకుండా ఆ సమయములో నా గదిలోనున్న మరికొందరు కూడా చూచారు. నాతోపాటు ఆ దృశ్యమును చూచిన వారికి ఆ సంఘటన

చాలా క్రూరమైన పనిగా కనిపించినది. అప్పుడు వారు “ఇది ఎంత దుర్మార్గమైన పని, అమెరికా ప్రభుత్వము ఉగ్రవాదులకు చెడు చేసివుంటే ఆ ప్రభుత్వము మీద కోపముండవచ్చును. వారు అమెరికా ప్రభుత్వము మీద కక్షను తీర్చుకోవచ్చును. ప్రభుత్వములో ఉండి తమకు చెడు చేసిన నాయకుల మీద శత్రుత్వమును పెంచుకోవచ్చును. దానికి తగినట్లు చెడు చేసిన వారిని హింసించవచ్చునూ, చంపవచ్చునూ, తమ కోపమును తీర్చు కోవచ్చును. అయితే ఇక్కడ యోచిస్తే ప్రభుత్వము వేరు ప్రజలు వేరుకదా! ప్రభుత్వము పాలించునది, ప్రజలు పాలించబడువారు కదా! ప్రజలు తమ బ్రతుకు తాము బ్రతుకుచున్నారు కానీ, ఇతర దేశస్థులకు వారు శత్రువులు కారు కదా! ఏ శత్రుత్వము లేని ప్రజల మీద ఉగ్రవాదులు తమ కక్షను తీర్చుకోవడము క్రూరత్వమూ, దుర్మార్గము తప్ప ఏమీకాదనీ, ఇది మనుషులు చేయదగిన పనికాదనీ, అమానుషమనీ ఉగ్రవాదులైనంతమాత్రమున ఎవరి మీద కోపముతో ఎవరిని శిక్షిస్తున్నామను యోచనగానీ, ఆలోచనగానీ వారికి ఉండదా? శత్రువుమీద దాడి చేయడమూ, చంపడము యుద్ధనీతి అవుతుంది. కానీ శత్రువుకాని వానిమీద దాడి చేయడమూ, చంపడమూ యుద్ధనీతి అనిపించుకోదు. ఇది మనిషి చేసే రాక్షసత్వము అనిపించు కొంటుంది. దీనికి మీరేమంటారు.” అని నన్ను అడిగారు.

అప్పుడు నేను ఇలా చెప్పడము జరిగింది. మీకుగానీ నాకుగానీ ఇరాక్ ఉగ్రవాదులు చేసినది తప్పుగా కనిపించినా, వారికి అది ఒప్పుగానే కనిపించియుండును. మనము ఆ పనిని క్రూరమైన పనిగా చెప్పినా, అది వారికి వీరులు చేసే సాహస పనిగా కనిపించియుండవచ్చును. ఒక మనిషి ఎదుటి వారి దృష్టిలో తప్పు చేసినా, అది ఆ మనిషికి సమర్థనీయమైన పనిగా ఉండవచ్చును. ఇప్పుడు మీరు నన్ను అడిగినట్లు ఈ మధ్య

కాలములో ముంబాయినగరమందు జరిగిన ఉగ్రవాదుల దాడిని గురించి, ఉగ్రవాదమును సమర్థించు ఉగ్రవాద సానుభూతిపరున్ని ఇలా ప్రశ్నించాను. "ముంబాయి నగరములో తమతో ఏ శత్రుత్వములేని అమాయక ప్రజలను ఉగ్రవాదులు విచ్చలవిడిగా కాల్చి చంపడము న్యాయమేనా? దేవుడు ఈ చర్యను ఒప్పుకుంటాడా? అని అడిగాను. దానికతను చెప్పిన సమాధానము నాకు ఆశ్చర్యమును కల్గించినది. ఒక దేశ నాయకునికి కనువిప్పు కల్గించుట కొరకు ఆ దేశములోని ప్రజలను హింసించినా ఫరవాలేదు. ఆ దేశాధిపతిని మార్చుటకు లేక పరీక్షించుటకు అతని రాజ్యములోని వానిని బాధపెట్టినా లేక చంపినా తప్పేమీ కాదు. అలాగే అమెరికా దేశాధిపతిలో మార్పును తెచ్చుటకు ఆ దేశ పౌరున్ని చంపినా తప్పేమీకాదన్నాడు. దానికి నేను బదులుగా "ఇదేమి న్యాయము? ఎవడో నీకు శత్రువైతే వానిమీద దాడి చేయక నీతో ఏ శత్రుత్వమూలేని, నీతో ఏ సంబంధమూలేని వానిమీద దాడి చేయడము పాపకార్యమగును. దేవుడు ఇటువంటి కార్యము ఏమాత్రము ఒప్పుకోడు. ఒక ఇంటి యాజమని ప్రక్క ఇంటి వారిని నష్టపరిస్తే, నష్ట పోయిన వ్యక్తి నష్టము చేసిన వ్యక్తి ఇంటిలోని బాలున్ని బజారులో దొరికాడని చంపితే, సమాజము ఒప్పుకుంటుందా? ఏ పాపమూ తెలియని పిల్లవానిని చంపడము అన్యాయమూ, అక్రమము అంటుంది కదా! అదే విధముగా అమెరికా అను ఇంటి యజమాని అయిన జార్జిబుష్ మీద కోపముతో ఏ పాపము తెలియని ఆ దేశ (ఇంటి) ప్రజలను హింసించి చంపడము కూడా అన్యాయము, అక్రమమూ అమానుషము అగును కదా! ఇటువంటి పనిని చేసిన వారు దేవుని దృష్టిలో శిక్షార్హుడగును" అని అన్నాను.

నా మాటను వినిన వ్యక్తి చిన్నగ నవ్వి దేవుని లెక్కలో మేము శిక్షార్హులమా? నీకు తెలుసో తెలియదో దేవుడు ఇదే విషయమును మా

గ్రంథములో సురా అన్‌ఫాల్ (8.28)లో 28 ఆయత్‌నందు ఇలా చెప్పాడు. "వాస్తావానికి మీ ఆస్తిపాస్తులూ, మీ సంతానమూ మిమ్మల్ని పరీక్షించే సాధనములని, నిశ్చయముగా దేవునివద్ద గొప్ప ప్రతిఫలమ్ ఉన్నదని తెలుసుకోండి" అని వ్రాయబడివుంది. దీనికి మా హదీసు పండితులు చెప్పు వివరము ఇలా ఉన్నది. ఈ జీవితము తర్వాత జీవితము కొరకు నీ ఇంటిలో ఏ పరీక్ష అయినా జరుగవచ్చును. నీ భార్య రోగగ్రస్తురాలు కావచ్చును, నీ ఆస్తి పోవచ్చును. అలాగే నీ సంతతి అయిన చిన్న పిల్లలు కూడా ప్రమాదము వలన చనిపోవచ్చును. లేక అంగవైకల్యముగా పుట్టవచ్చును. ఇలా కలుగు బాధలన్నీ దేవుడు నిన్ను పరీక్షించుటకు విధించునవని చెప్పవచ్చును. రెండేళ్ళ వయస్సున్న నీ కొడుక్కు భయంకరమైన జబ్బువచ్చి అది ఎక్కడా నయము కాకుండ ఆ బాలుడు నిత్యము బాధపడడము దేవుడు నీకు పెట్టిన పరీక్ష. నిన్ను పరీక్షించుటకు నీ చుట్టువున్న వ్యక్తులను గానీ, ఆస్తులనుగానీ, సౌకర్యములనుగానీ దేవుడు వాడుకొనును. అంత పెద్ద దేవుడే ఒక మనిషిని పరీక్షించుటకు అమాయకుడైన వాని కొడుకును రోగగ్రస్థునిగనో, అంగహీనునిగానో చేయునపుడు, అది సమంజస కార్యమే అయినపుడు, మేము అమెరికా వానిని పరీక్షించుటకు లేక మార్చుటకు అమాయకుడైన ఆ దేశ పౌరున్ని చంపడములో తప్పేమి లేదు కదా!" అని వివరముగా చెప్పాడు.

అతను గొప్ప గ్రంథములోని వాక్యమును తీసుకొని ఉదాహరణతో సహా వివరించినపుడు అతని మాటకు బదులుగా ఏమీ చెప్పలేకపోయాను. కానీ దేవుడు ఈ విధముగా చెప్పియుండునా అను అనుమానము వచ్చుట వలన 16-05-2010వ దినమున నాకు పరిచయమున్న ఇస్లామ్ మత పెద్దలైన, దేవున్ని గురించి ఎంతో పెద్ద ఉపన్యాసములిచ్చు పండితులైన

ఇద్దరు వ్యక్తుల దగ్గరకు పోయి, "ఒక వ్యక్తి పవిత్ర ఖురాన్‌లోని వాక్యము ఇలా ఉన్నదని వివరముగా చెప్పాడు. అయినా ఈ వాక్యములో నాకు కొంత సంశయమున్నది. దానిని గురించి మీరు వివరించి చెప్పండి" అని అడిగాను. అప్పుడు వారు ఇలా అడిగారు.

**హదీసు జ్ఞానులు :-** దివ్య ఖురాన్‌లో ఏ సురాలోని వాక్యము?
**నేను :-** సురా అన్‌ఫాల్, ఆయత్ 28
**హదీసు జ్ఞానులు :-** అందులో దేవుడు మనిషిని ఏ విధముగానైన పరీక్షించ వచ్చునని తెలియబడినది. దీనిలో నీకు ఏమి అర్థము కాలేదు?

**నేను :-** దేవుడు చెప్పిన వాక్యములో నాకు ఎటువంటి సంశయమూ లేదు. ఎందుకనగా ఖురాన్ గ్రంథములో చెప్పబడిన దేవుని సందేశము, దేవుడు పంపిన మాట సత్యమైనది. వచ్చిన అనుమానమంతా ఆ వాక్యమును సరిగా అర్థము చేసుకొన్నామా లేదా అనియే, నేను ఖురాన్ దైవగ్రంథమను విశ్వాసముతో అంతా కాకున్నా కొంతవరకైనా చదివాను. అందులో నాకు అర్థమైనదానికీ, వారు చెప్పిన దానికీ కొంత వ్యత్యాసమున్నది. ఇదే విషయమును గురించి నేను చదివిన 29వ సురా అన్‌కబూత్‌లో 2వ ఆయత్ నందు ఇలా ఉన్నది. **"మేము దైవాన్ని విశ్వసించాము అని ప్రజలు అన్నంత మాత్రమున తాము విడిచిపెట్టబడతారనీ, తాము పరీక్షింపబడరనీ భావిస్తున్నారా"** అని కలదు. ఇక్కడ "పరీక్ష" అను పదము వచ్చినా అది ఏ అర్థముతో కూడుకొన్నదో కొంత తెలియబడినది. దైవము మీద విశ్వాసము లేని చోట పరీక్షింపబడుట వేరు అర్థమునియ్యవచ్చును. కానీ దైవము మీద విశ్వాసమున్న చోట పరీక్షింపబడుట విశేషార్థముతో కూడుకొని ఉన్నది. ఇదే విషయమునకు సంబంధించినది భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్య యోగములో 22వ శ్లోకము చెప్పినపుడు మొత్తము హిందువులు

దానిని అర్థము చేసుకోలేక అపార్థము చేసుకొన్నారు. ఆ శ్లోకమునకు భావమును వ్రాసిన స్వామీజీలు మొత్తము దేవుడు చెప్పిన మాటకు వ్యతిరేఖ భావమును వ్రాశారు. వారు వ్రాసినది నూటికి నూరుపాళ్ళు అసత్యమైనా, దానిని వారు ఏమాత్రము యోచించకుండా సత్యమే అనుకొన్నారు. భగవద్గీతలో ఒక్క శ్లోకమునే కాకుండా వివరించి చూపితే అనేక శ్లోకములకు భావదోషము ఏర్పడినది. చెప్పిన ఆధ్యాత్మికవేత్తలందరూ పప్పులో కాలు వేయడమేకాక, తాము పొరపాటు పడినామనీ గుర్తించుటకు కూడా వీలు లేకుండా మాయ చేసినది. అలాగే కొంత బైబిలులోనూ, కొంత ఖురాన్‌లోనూ ప్రవక్త చెప్పినది ప్రజలు సరిగా అర్థము చేసుకోలేక పోయారనుకుంటాను.

ప్రవక్తలు చెప్పిన భావమును అందరూ సరిగా అర్థము చేసుకోలేద నుటకు ఉదాహరణగా ఒక విషయమును గమనిద్దాము. "ఆదర్శ మహిళ హజ్రత్ ఆయిషా" అను పుస్తకములో ఒకచోట 141 పేజీలో ఇలా వ్రాయబడి ఉన్నది. "హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ ప్రాణాలు పోతుండగా క్రొత్త బట్టలు తెప్పించుకొని తొడుక్కొన్నాడు. కారణము అడగ్గా "ముస్లిమ్ ఏ దుస్తుల్లో మరణిస్తే ఆ దుస్తులతోనే లేపబడుతాడు" అని చెప్పారాయన. హజ్రత్ ఆయిషాకు ఈ సంగతి తెలిసింది. "ఓ ప్రభూ! అబూ సయీద్ పై దయదలచు. దుస్తులు దైవప్రవక్త దృష్ఠిలో కర్మలు (ఆచరణలు) అని భావము. ప్రజలు ఖియామత్ నాడు నగ్న శరీరముతో, తలనుండి కాళ్ళ వరకు అనిచ్ఛాదీన శరీరాలతో లేపబడతారని దైవ ప్రవక్త స్పష్టముగా చెప్పి యున్నారు." అని మహమ్మద్ ప్రవక్తగారి నాల్గవ భార్య హజ్రత్ ఆయిషాగారు చెప్పడము జరిగినది. ఈ సమాచారమును బట్టి మహాప్రవక్త గారి భావము ఒకటైతే ప్రవక్తయున్న కాలములోనే దానిని వేరు విధముగా అర్థము

చేసుకొన్న వారున్నపుడు, ఇప్పుడు ఆ విధముగానే కొన్ని వాక్యములను అర్థము చేసు కోవడములో కొందరు పొరపాటు పడివుండవచ్చును కదా!

**హదీసు జ్ఞానులు :-** ఎక్కడైనా చిన్న పొరపాట్లు ఉండవచ్చును. కానీ పూర్తి భావము మారిపోవునంత పొరపాటు ఎక్కడా కనిపించడము లేదు. ఏదైనా సందర్భానుసారము చూచుకొంటే అర్థము సరిపోతుంది. సందర్భమును చూడకపోతే కొంత భావము మారవచ్చును. ఏదైనా అనుమానము వస్తే అడిగి సంశయమును నివృత్తి చేసుకోవచ్చును. చర్చల వలన దైవజ్ఞానమును బాగా అర్థము చేసుకోవచ్చును.

**నేను :-** చర్చల వలన దైవజ్ఞానము అనుమానము లేకుండా అర్థము కాగలదని నేను అనుకోవడము వలన దైవ సందేశములను బాగా తెలిసిన మిమ్ములను కలిసి అడుగుచున్నాను. మీరు నా సంశయములకు విసుగుకోక సమాధానము చెప్పుదురని కోరుచున్నాను. మొదటి ప్రశ్న ఏమనగా! మనిషి ఒకమారే పుట్టుచున్నాడా? లేక అనేకమార్లు పుట్టుచున్నాడా?

**హదీసు జ్ఞానులు :-** ఒక మనిషి ఒకేమారు పుట్టును, ఒకేమారు మరణించును. అనేక మార్లు పుట్టడములేదు, అట్లే మరణించడము లేదు.

**నేను** :- ఇది దేవుడు చెప్పినదా లేక మనిషి చెప్పినదా?

**హదీసు జ్ఞానులు** :- ఇది దివ్య ఖురాన్ గ్రంథములో దైవసందేశముగా హజ్రత్ మహమ్మద్ ప్రవక్తగారు చెప్పినది.

**నేను :-** ప్రవక్తగారు చెప్పిన వాక్యము సత్యమైనదని పూర్తిగా విశ్వసిస్తున్నాను. అయితే ప్రవక్తగారు చెప్పినది దైవసందేశము. దైవసందేశము ఎప్పటికైనా శాసనముగా నిలిచివుంటుంది. శాసనము జరిగితీరుతుంది. అయితే జరిగిన ప్రత్యక్ష సంఘటనలను బట్టి చూస్తే ప్రవక్త చెప్పిన వాక్యమును తప్పుగా మనము అర్థము చేసుకొన్నామేమో అని తెలియుచున్నది. మనిషి ఒకేమారు

జన్మిస్తాడు అంటే అనేక ప్రశ్నలు వస్తాయి, చివరకు జవాబులేని ప్రశ్న మిగులుతుంది. ఒకవేళ ప్రయత్నము చేసి జవాబులను చెప్పినా, ఆ జవాబులు శాస్త్రబద్దత లేనివై ఉండును. శాస్త్రబద్ధత లేని జవాబు సత్యము కాదు. అందువలన ప్రవక్తగారు, ప్రళయములో తిరిగి శరీరముతోనే మనిషి లేపబడుతాడు అన్నమాట సత్యమేగానీ, అది ఒకేమారా, అనేకమార్లా అని అర్థము చేసుకోవడములో మనము పొరపడ్డామేమోనని అనుమానము వస్తున్నది. దానిని అలా వదలి మనిషి ఒకేమారు పుట్టుచున్నాడు అని అర్థము చేసుకొంటే వెంటనే ఒక ప్రశ్న వస్తున్నది. అదేమనగా! మనిషి ఒకేమారు పుట్టి ప్రళయములో ఒకేమారు లేపబడితే, అలా లేపబడిన తర్వాత ఆ జీవితమును ఏమనాలి? ఎందుకు మనిషి ప్రళయములో లేపబడతాడు?

**హదీసు జ్ఞానులు :-** మనిషి తన జీవితములో చేసుకొన్న మంచి పనులను, చెడు పనులను ప్రళయ దినమున సమాధినుండి లేపినపుడు దేవుడు లెక్కించి అతను చేసిన పనులనుబట్టి స్వర్గ నరకములకు పంపును. దానిని మరణము తర్వాత జీవితము అంటాము. మనిషి చేసుకొన్న కర్మ లిఖితమును బట్టి స్వర్గ నరకములను మనిషి అనుభవించే దానికి లేపబడుతాడు.

**నేను :-** ఒక మనిషి తాను జీవితములో చేసుకొన్న పనులనుబట్టి (కర్మను బట్టి) పాపపుణ్యములను బట్టి రెండవ జీవితములో లేక మరణానంతరము స్వర్గ నరకములను (సుఖదుఃఖములను) అనుభవించే దానికి పుట్టింపబడు చున్నాడు. లేక తిరిగి సమాధినుండి లేపబడుచున్నాడు. ఇదంతా సత్యమే. ఆ మరణము తర్వాత ఆ జీవితము ఎక్కడ జరుగుచున్నది అని ప్రశ్నిస్తే స్వర్గములో, నరకములో అని జవాబు కలదు. ఆ స్వర్గ నరకములు భూమి మీద ఉన్నాయా లేక ఎక్కడైనా ఉన్నాయా అని ప్రశ్నిస్తే దీనికి సరియైన జవాబుగానీ, శాస్త్రబద్ధతతో కూడుకొన్న జవాబుగానీ ఏదీలేదు. ఎవరూ

వాటిని ఎక్కడో చూచారు అను ఆధారములు కూడా లేవు. అట్లని స్వర్గ నరకములు సత్యము కావా అంటే స్వర్గ నరకములను మాటలు దేవుని చేత చెప్పబడినవి. అందువలన అవి పూర్తి సత్యమైనవే. కానీ వాటిని గురించి మనము సంపూర్ణముగా అర్థము చేసుకోలేదని చెప్పుచున్నాము. దేవుడు చెప్పిన స్వర్గ నరకములు మనిషి తప్పక అనుభవిస్తున్నా అవి ఎక్కడో ఉన్నాయని చెప్పుకోవడము పొరపాటు. మనిషికి ప్రళయము తర్వాత వాడు సమాధినుండి లేపబడి మరణానంతర జీవితమును స్వర్గ నరక రూపములలో (సుఖదుఃఖ రూపములో) భూమిమీదనే అనుభవిస్తున్నాడను సత్యమును మనిషి తెలుసుకోలేకపోయాడు. అని మేము అనుకొంటున్నాము. ఈ విధముగా అయితే భవిష్యత్తులో ప్రశ్నలు రావు. అంతేకాకుండ దేవుని మాట భంగము కాకుండా నెరవేర్చబడుతుందని అనుకొంటాను.

**హదీసు పండితులు :-** అట్లుకాదు. స్వర్గ నరక లోకములు ఉన్నాయి. భూమిమీదలేవు. మనిషి చేసుకొన్న దాని ఫలితముగా అతను స్వర్గానికి, నరకానికి పంపబడతాడు. ఆ విధముగా ప్రళయములో దేవుడు మనిషి తప్పులన్నిటిని లెక్కించి దానినిబట్టి తీర్పు తీర్చి స్వర్గనరకములకు పంపును. అంతవరకు చనిపోయినవాడు సమాధిలో ఉండవలసిందే.

**నేను :-** మీరు చెప్పినట్లు ఒక మనిషి చనిపోయిన తర్వాత ప్రళయము వరకు సమాధిలో ఉండి ప్రళయములో దేవునిచేత సమాధి నుండి శరీరము తోనే లేపబడి స్వర్గ నరకములకు పంపబడుతాడు అని అనుకొంటే, అది పూర్తి జీవితమును గడిపి చనిపోయిన వ్యక్తికి మీరు చెప్పిన భావము ప్రకారము జరుగవచ్చును. అట్లు కాకుండ పుట్టిన వ్యక్తి పూర్తి జీవితమును గడపకముందే నాలుగు సంవత్సరములకే చనిపోవడము కూడా జరుగుచున్నది. అంతే కాకుండా ఒక నెల దినములకే చనిపోవు పసి పిల్లలున్నారు. అట్లే యుక్త

వయస్సు రాకనే, వివాహము కాకనే చనిపోవు వారున్నారు. ఒక సంవత్సరములో చనిపోయిన పిల్లలుగానీ, ఒక నెలకే చనిపోయిన పిల్లలకు గానీ లెక్కించుటకు ఎటువంటి పాపపుణ్యములుండవు. అప్పుడు ప్రళయ కాలములో సమాధినుండి లేపబడి స్వర్గానికి పంపబడతారా? నరకానికి పంపబడతారా? బహుశా ఈ ప్రశ్నలకు జవాబు ఉండదు. అంతేకాకుండా మరణము తర్వాత స్వర్గ నరకముల కథ అటుంచితే ప్రస్తుత జీవితములో ఒక సంవత్సరము వయస్సున్న చిన్న బాలునికి భయంకరమైన రోగము వచ్చి బాధపడుచున్నాడు. ఎక్కడో ఉన్నదను నరకము ఎట్లున్నదో మనము చూడలేదు కానీ, సంవత్సరము వయస్సున్న బాలుడు రోగముతో అనుభవించు బాధ ప్రత్యక్ష నరకముగా కనిపిస్తున్నది. దీనిని చూచిన తర్వాత అది నరకము కాదా అనిపిస్తున్నది. ఎవరికైనా శిక్ష ఉంది అంటే అది తప్పు (పాపము) చేసివుంటేనే అని అర్థమగుచున్నది. ఇప్పుడు సంవత్సరము బాలుడు రెండు సంవత్సరములు రోగముతో బాధను అనుభవించి దీనముగా చనిపోయాడు. అతని జీవితములో మంచి పనులూ చేయలేదు, మరియు చెడు పనులూ చేయలేదు. అటువంటి వానిని ప్రళయములో సమాధినుండి లేపి దేవుడు అతనిని ఏమని విచారించును? అతనిని స్వర్గానికి పంపునా? నరకానికి పంపునా? బహుశా దీనికి కూడా సమాధానముండదు. అంతేకాకుండా అంత చిన్న పిల్లవానికి భయంకర రోగమువచ్చి ఆ బాలుడు నన్ను రక్షించువారు లేరా అన్నట్లు దీనంగా చూస్తూ ఏడుస్తుంటే, ప్రక్కన చూచే వారికి హృదయ విదారకముగా ఉంటూ, ఈ పిల్లవాడు ఏమి తప్పు చేశాడని ఈ రోగము వచ్చింది. దేవున్ని అనంత కరుణామయుడు అంటారే, పుట్టినప్పటినుండి ఏ పాపము చేయని పసి పిల్లవానికి రోగము వచ్చి బాధపడుచుంటే, తల్లితండ్రులు దేవున్ని తమ కొడుకు బాగుపడాలని ఎంతగా వేడుకొనినా దేవుడు ఆ పిల్లవానిమీద తన అనంతమైన కరుణలోనుండి

కొంత కరుణనైనా చూపవచ్చును కదా! ఎంతోమంది దుర్మార్గులు విచ్చల విడిగా చెడుపనులు చేయుచూ హాయిగానున్న వారిని ఏమాత్రము శిక్షించక పోయినా ఫరవాలేదు. కానీ చిన్న పిల్లవానిని రక్షించవచ్చును కదా! అని ప్రజలంటారు ఈ విషయములో తెలిసిన పెద్దలు మీరేమంటారు.

**హదీసు జ్ఞానులు :-** అది దేవుడు ఆ బాలుని తల్లితండ్రులను దేవుని మార్గములో ఎంతగా ఉన్నారోనని పరీక్షించుటకు చేసిన పరీక్ష అని చెప్పవచ్చును. అన్‌ఫాల్ సురాలో 28వ ఆయత్‌లో చెప్పినట్లు "వాస్తవానికి మీ ఆస్తిపాస్తులు, మీ సంతానమూ మిమ్మల్ని పరీక్షించే సాధనాలనీ, నిశ్చయముగా అల్లావద్ద గొప్ప ప్రతిఫలమ్ ఉన్నదని తెలుసుకోండి." అని ఉన్నదానిని బట్టి దేవుడు తల్లితండ్రులను పరీక్షించు నిమిత్తము పిల్లలకు రోగమును కలిగించవచ్చును. దానివలన తల్లి తండ్రుల స్పందన దేవుని ఎడల ఎట్లుంటుందో తెలియును. పిల్లవానికి రోగము రావడము తల్లి తండ్రుల పరీక్ష కొరకేగానీ వేరుకాదు.

**నేను :-** పరీక్ష అను పదము అన్‌ఫాల్ సురాలోనే కాకుండా అల్‌బఖరా సురాలో 155 ఆయత్‌లో కూడా ఇలా ఉన్నది. "నిశ్చయముగా మిమ్మల్ని భయ ప్రమాదాలకు , ఆకలి బాధలకు, ధన, ప్రాణ, ఆదాయాల నష్టములకు గురిచేసి పరీక్షిస్తాము" అనికూడా ఉన్నది. ఇక్కడ చెప్పినవన్నీ వాస్తవమే. ఎప్పుడు దేనికి పరీక్షిస్తాడను విషయమును అర్థము చేసుకోవడములో పొరపడినామని నేను చెప్పుచున్నాను. దివ్య ఖురాన్‌లోని దైవ సందేశమైన వాక్యములు శాసనములు, జరిగి తీరునవి. కావున ఖురాన్ దేవుని శాస్త్రము అవుతుంది. అది ముమ్మాటికీ నిజమే. నా ఆవేదనంతా దైవ సందేశములను మానవులు సరిగా అర్థము చేసుకోకుండా పోయారనియే. ఇదంతా మేము చెప్పడానికి ముఖ్య ఉద్దేశ్యము దేవుని వాక్కును సక్రమముగా అర్థము

చేసుకోవాలని తప్ప వేరు ఏమీ లేదు. సాటి వ్యక్తి దేవునికి సమీపము కావాలని, మాయకు దూరము కావాలని చేయు ప్రయత్నమే ఈ రచన సారాంశము.

ఇప్పుడు మేము చెప్పు భావమును జాగ్రత్తగా విని అర్థము చేసుకో గలరని అనుకుంటున్నాను. దేవుడు సమస్తమును సర్వులను సృష్ఠించిన సృష్ఠికర్త. ఆయనకు తెలియునది సర్వజగత్తులో ఏది లేదు. దేవుడు అంతటా వ్యాపించివుండి అన్నిటిని అందరినీ చూడగల్గుచున్నాడు. ప్రతి మనిషిలోపల ఏ గుణమున్నదీ, వానికి బయట ఏ ధనమున్నదీ అన్నీ ఆయనకు (దేవునికి) తెలుసు. మనిషి పుట్టబోయేముందు వాడు ఇలా పుట్టి, ఇలా పెరిగి, ఇలా తిరిగి, ఇలా అనుభవించి, ఇలా ముసలివాడై, ఇలా చనిపోవాలను నిర్ణయించి వ్రాసిపెట్టబడిన కర్మను దేవుడే మనిషి వెంట పంపుచున్నాడు. **కర్మ ఆచరణ పత్రములేనిది ఎవడూ పుట్టుటకు వీలులేదు. దానినే తలవ్రాత అనికూడా అంటాము.** దీనిని గురించి పవిత్ర ఖురాన్ గ్రంథములో అల్‌ఇన్‌ఫితార్ అను 82 సురాలో 5 నంబర్ ఆయత్‌లో "ప్రతి వ్యక్తి తాను ముందు వెనుక చేసిన నిర్వాకమేమిటో తెలిసిపోతుంది." అని ఉన్నది. అంతేకాక ఇదే విషయమునే 83 సురా అయిన అల్ ముత ఫ్ఫిఫీన్ సురాలో 7,8 ఆయత్‌లలో "నిస్సందేహముగా దుష్టుల ఆచరణ అంతా కారాగారం చిట్టాలో నమోదయి వుంది. కారాగారం చిట్టా అంటే నీకేమైనా తెలుసా? అదొక వ్రాసిన పుస్తకము" అని ఉన్నది. మరియు 84 సురా అయిన అల్ ఇన్షికాక్‌లో 10వ ఆయత్‌నందు **"ఎవరి ఆచరణ పత్రమ్ (కర్మపత్రమ్) అతని వీపువెనుక ఇవ్వబడుతుందో"** అనికూడా కలదు. ఆచరణ పత్రము అనగా పనుల నిర్ణయపట్టిక అని అర్థము. ఆచరణ పత్రము అనగా పాపముల నిర్ణయపట్టిక లేక పాపముల నమోదు పట్టిక అని చెప్పవచ్చును. ఆచరణ అనగా పని

అని అందరికీ తెలుసు. మనిషి యొక్క ఆచరణ పత్రము మనిషి పుట్టకముందే ఉన్నదనుటకు 80వ అబస సురాలో 20,21,22 ఆయత్‌లో **"దేవుడు అతనిని వీర్య బిందువుతో పుట్టించాడు అతని భాగ్యాన్ని నిర్ణయించాడు, తర్వాత అతని జీవిత మార్గమును సుగమము చేశాడు. తర్వాత మృత్యువు నిచ్చాడు, సమాధికి చేర్చాడు"** అని ఉన్నది. మనిషికి మృత్యువు రాకముందే, అతను సమాధికి చేరకముందే దేవుడు అతని జీవిత విధానమును నిర్ణయించాడని తెలియుచున్నది. అటువంటి దేవునికి మనిషియొక్క ప్రతి ఆచరణా తెలుసు. ప్రపంచములో మనిషి ఏమి చేశాడు, ఏమి చేస్తున్నాడు, ఏమి చేయ బోతున్నాడు అను విషయము ఆయనకు (దేవునికి) తెలుసు. కానీ ఆయన విషయము మాత్రము ఎవరికీ తెలియదు. ఇదే విషయమును భగవద్గీతలో విజ్ఞానయోగమునందు 26వ శ్లోకమున ఇలా వున్నది.

*శ్లో॥ వే దాహం సమతీతాని వర్తమానాని చార్జునా,*
*భవిష్యాణిచ భూతాని మాంతు వేద న కశ్చన ॥*

**భావము :-** "సమస్త జీవరాసులకు జరుగుచున్న విషయములు, మరియు జరుగబోవు విషయములు, జరిగిన విషయములు అన్నీ నాకు తెలుసు కానీ ఇటువంటి నన్ను మాత్రము ఎవ్వరూ తెలియరు." ఈ విధముగా దేవునికి తెలియనిది ఏదీ లేదు. ఒక మనిషి పుట్టినప్పటినుండి చనిపోవు వరకు ప్రపంచములో ఏమి చేయుచున్నాడో, ఏమి చేయబోతాడో ముందే దేవునికి తెలిసివున్నపుడు అతనిని పరీక్షించవలసిన అవసరముండదు. ఒక విద్యార్థి ఎంతవరకు చదువును అర్థము చేసుకొన్నాడో తెలియదు, కావున పరీక్షపెట్టి వ్రాసిన వ్రాతనుబట్టి వచ్చిన మార్కులనుబట్టి ఇంతవరకు నేర్చుకొన్నాడని తెలియుచున్నారు. పాలలో నీళ్ళు ఎన్ని ఉన్నాయని తెలియనపుడు ఒక పరికరముతో పరీక్షించి పాలశాతమును, నీటి శాతమును

తెలుసుకొంటున్నాము. దేనినైనా తెలియనపుడు పరీక్ష అవసరముగానీ తెలిసినపుడు అవసరములేదు కదా! ఒక మనిషి యొక్క విధానమూ, వాని మనో భావమూ, గుణ భావమూ తెలిసినపుడు వానిని పరీక్షించనవసరము లేకుండానే వీడు ఇటువంటివాడని చెప్పవచ్చును. అట్లే ఒక మనిషియొక్క కర్మ లిఖితమూ, కార్య ఆచరణ, గుణ స్వభావమును పూర్తిగా తెలిసిన దేవుడు మనిషిని పరీక్షించవలసిన అవసరమూ లేదు.

అయితే ఖురాన్‌లో సురా బఖరా, సురా అన్‌ఫాల్‌లో పరీక్షింపబడును అని వ్రాయబడివుంది కదా అని ఎవరైనా అడగవచ్చును. దానికి సమాధానము ఏమనగా! మనిషి యొక్క జీవితములో ప్రతీదీ ముందే కర్మ లిఖితములో ఉండునని చెప్పుకొన్నాము కదా! అవి అన్నీ దేవునికి తెలుసు అని కూడా చెప్పుకొన్నాము. అందువలన వాటిని పరీక్షించనవసరము లేదని కూడా చెప్పాము. అయితే మనిషి జీవితములో కర్మపత్రములో లిఖించని విషయమొకటున్నది. అది కర్మపత్రముకంటే అతీతమైన దేవుని జ్ఞానము. దేవుని జ్ఞానము మనిషియొక్క శ్రద్ధనుబట్టి, తెలుసుకోవాలను ఆతృతను బట్టి లభించుచుండును. అది జీవితములో ముందు నిర్ణయింప బడదు. జ్ఞానమును సంపూర్ణముగా సంపాదించుకొని ఆచరించిన వానికి మోక్షము లభించును. మోక్షము అనగా స్వర్గము కాదు, సర్వ నరకములకు అతీతమైన దేవుని సన్నిధానమును మోక్షము అంటాము. ఇదే మోక్షమును గురించి ఖురాన్‌లో 87 సురా అయిన అల్ ఆలాలో 17,18 ఆయత్‌లలో **"పరలోకము ఉత్తమమైనది మరియు శాశ్వితమైనది. ఈ మాటే పూర్వ గ్రంథాలలో కూడా వ్రాయబడివున్నది."** స్వర్గ నరకములు శాశ్వితమైనవి కావు. అవి పాపపుణ్యములను బట్టి వచ్చి పోవుచుండును. పరలోక మొక్కటే అన్నిటికంటే ఉత్తమమైనదీ, శాశ్వితమైనది. ఈ దైవ సాన్నిధ్యమైన

పరలోకము (మోక్షము) మనిషికి లభించాలంటే అతను జ్ఞాన మార్గములో ఒక స్థాయివరకు ఎదగాలి. ఆ స్థాయికి ఎదిగిన వాడు పర లోకమునకు పోతాడు. ఎదగని వాడు స్వర్గ నరకములకు పోతూవుంటాడు. జ్ఞాన మార్గములో స్థాయిని మనిషే సంపాదించుకోవాలి. ప్రపంచ విషయముల వలె జ్ఞానము నిర్ణయించబడి ఉండదు. మనిషి ఎంత జ్ఞానమును సంపాదించుకొంటే మోక్షము పొందును అను విషయము సాటి మనిషికి తెలియాలి అంటే మనిషిని జ్ఞాన విషయలందు పరీక్షించవలసిందే. పరీక్ష అనునది జ్ఞాన విషయములో అవసరమనీ, అది సాటి మనిషికి మోక్షమునకు ఎంత జ్ఞాన స్థాయి అవసరము అని తెలియుటకు, ఒక మనిషి పరీక్షింపబడుతాడనీ, ఈ పరీక్షలనే ఖురాన్ గ్రంథములో కూడా వ్రాయడము జరిగినదనీ తెలియవలెను.

ముఖ్యముగ గమనించవలసినది ఏమంటే! దేవుని జ్ఞానమునకు మాయ పనులు (కర్మలోనున్న ఆచరణలు) అన్నీ ఆటంకమును కలుగ జేయునవిగా మరియు వ్యతిరేఖమైనవిగా ఉండును. దైవజ్ఞానములో పోవాలనుకొన్న వానికి జీవితములోని కర్మ పనులన్నీ ఆటంకముగా ఉంటూ జ్ఞానమార్గమునకు అవరోధమును కల్గించుచుండును. ఆ అవరోధములను (ఆటంకములను) దాటిపోవడమే జ్ఞానమార్గములోనున్న వానికి పరీక్షలాంటిది. దేవున్ని విశ్వసించినంతమాత్రమున, దైవజ్ఞానము మీద ధ్యాస కలిగినంతమాత్రమున ఎవడూ కర్మాచరణనుండి బయట పడలేడు. అటువంటి వానికే కర్మ పనులన్నీ పరీక్షలుగా ఉండునని తెలియ వలెను. ఇదే విషయమును పవిత్ర ఖురాన్ గ్రంథములో 29 సురా అయిన అన్ కబూత్ లో 2వ ఆయత్‌నందు ప్రజలు “మేము దైవాన్ని విశ్వసించాము అని అన్నంతమాత్రమున తాము విడిచిపెట్టబడతారనీ, తాము పరీక్షింప

బడరని భావిస్తున్నారా" అని చెప్పబడినది. దీనినిబట్టి అల్లాను (దైవాన్ని) విశ్వసించిన వారికి, వారి కర్మలే పరీక్షలుగా నిలబడునని తెలియుచున్నది. కర్మలు లేక కర్మాచరణలు మనిషి జీవితములోనికిరాకముందే నిర్ణయింప బడి ఉన్నాయని ఖురాన్‌లోని వాక్యముల ద్వారా తెలుసుకొన్నాము. ఒక మనిషికి, ఆ మనిషి యొక్క సమస్యలుగానీ, అతని భార్యయొక్క బాధలు (సమస్యలు) గానీ, లేక అతని కుమారుల సమస్యలు గానీ, ఆస్తికి సంబంధించినవి గానీ మొత్తము జీవితములోని అన్ని సమస్యలు దేవుని మార్గమునకు ఆటంకమగుచుండును. వాటిని అతిక్రమించడమే మనిషికి పరీక్ష. అతిక్రమించలేనివాడు జ్ఞానపరీక్షలో ఓడిపోయినట్లగును. వాటిని అతిక్రమించిన వాడు జ్ఞానపరీక్షలో నెగ్గినవాడగును (గెలిచినవాడగును.) అలా నెగ్గిన వారు మోక్షమును పొందును. అదియే అల్లాహ్‌వద్ద (దేవుని వద్ద) పొందు గొప్ప ప్రతిఫలము. దీనినే అన్‌ఫాల్ సురాలో 28వ ఆయత్‌లో **"వాస్తవానికి మీ ఆస్తిపాస్తులు, మీ సంతానము మిమ్మల్ని పరీక్షించే సాధనాలని నిశ్చయముగా చెప్పుచున్నాము. అల్లాహ్ వద్ద గొప్ప ప్రతి ఫలము ఉన్నదని తెలుసుకోండి".** అని ఉన్నది.

ఒక మనిషి చుట్టూ ఉండు సమస్యలన్నీ పరీక్షలనబడును. ఆ సమస్యలన్నీ కర్మల మూలముగా వచ్చినవే. ఇంటిలో భార్యకు రోగమొస్తే అది భార్యకర్మను బట్టి వచ్చివుండును తప్ప భర్తను పరీక్షించుటకు భార్యను దేవుడు బాధపెట్టలేదని తెలియాలి. అట్లే ఇంటిలో కుమారునికి భయంకరమైన నయముగాని రోగము వచ్చినదంటే, అది ఆ బాలుని కర్మ లిఖితము ప్రకారము వచ్చియుండును. కానీ తండ్రిని పరీక్షించుటకు అతని కుమారునికి రోగము వచ్చినదనుకోకూడదు. అట్లే అన్ని సమస్యలు వారివారి కర్మలనుబట్టి వచ్చునవే. అవియే దైవమార్గములో శోధనలుగా మారుచున్నవను

సత్యమును గ్రహించవలెను. అట్లుకాకుండా తండ్రిని పరీక్షించుటకు దేవుడు కుమారున్ని బాధపెట్టినా, భర్తను శోధించుటకు భార్యను ప్రమాదమునకు గురిచేసి బాధపడునట్లు చేసినా, అది దుర్మార్గము పని అగును. తీవ్రవాదులు అమెరికా మీద పగతో అమెరికా పౌరున్ని చంపినట్లగును. ప్రక్క ఇంటివాడు విరోధి అయితే అమాయకుడైన వాని కొడుకును చంపినట్లగును. మొత్తానికి అన్యాయమూ, అమానుష పనులగును. ఇట్లు అన్యాయము, అక్రమము అయిన పనిని దేవుడు చేయుననడము తప్పగును. వానివాని కర్మలు వానికి పరీక్షయగుచున్నవి గానీ, దేవుడు ఎవరినీ ప్రత్యేకముగా పరీక్షించడము లేదు. ఒకనిని పరీక్షించుటకు వాని కొడుకును గానీ, భార్యనుగానీ హింసలకు, రోగములకు, ప్రమాదములకు గురి చేయలేదు. దేవుడు అటువంటి పనులు ఎప్పటికీ చేయడు. అటువంటి అవసరము ఆయనకు లేదు. కర్మప్రకారము వచ్చు కష్టములకు ఓర్చుకొని ఓపికతో దైవమార్గములో ప్రయాణించు వానికి ఆత్యంత ఉన్నతమమైన, అతి ఉత్తమమైన, శాశ్వితమైన పరలోకము (ముక్తి) లభించును.

దేవుని మార్గములోనున్న వారికి, దైవము మీద తప్ప ఇతర దేవతల మీద ధ్యాసలేని వారికి దేవుడు ప్రపంచములోని సమస్యలనుగానీ, అనారోగ్య ములనుగానీ తొలగించడు. అయితే దైవమార్గము నుండి త్రప్పి పోకుండు నట్లు చేయును. ఇదే విషయమును, "దైవమును విశ్వసించిన వారికి పరీక్షలు లేవనుకోకూడదు" అని అన్ కబూత్ సురాలో చెప్పగా, భగవద్గీతలో "రాజ విద్యా రాజగుహ్య యోగము" అను అధ్యాయములో 22 శ్లోకమునందు ఇలా వున్నది.

శ్లో॥ *అనన్యాశ్చిన్త యన్తోమాం యేజనాః పర్యుపాసతే ।*
*తేషాం నిత్యాభి యుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥*

**భావము :–** "అన్యదేవతా చింత లేకుండా ఎల్లవేళల నన్ను ఉపాసించుచు నిత్యము నా ధ్యాసలోనున్న వారి యోగము యొక్క క్షేమమును నేనే చూచు చుందును." అన్నాడు. దీనినిబట్టి పరమాత్మను (దేవున్ని) మించిన వాడు ఎవరూ లేరనీ, ఏ దేవతాభక్తీ లేకుండా ఎల్లప్పుడు దేవున్ని ఆరాధించు వానికి, అతని సమస్యలనుండి దేవుడు అతనిని కాపాడడనీ, అతను సమస్యలలో ఓడిపోయి దైవమార్గములోనుండి తప్పిపోకుండా అతని విశ్వాసమునకు (యోగమునకు) బలమునిచ్చి కాపాడుచుండునని తెలయు చున్నది. ఖురాన్‌లో చెప్పినా, భగవద్గీతలో చెప్పినా దేవునిది ఒక్కటే మాటగా ఉన్నదని గ్రహించవచ్చును. దేవుని మీద విశ్వాసము, జ్ఞానము, యోగము ఉన్నంత మాత్రమున సమస్యలు ఆటంకములు (పరీక్షలు) ఉండవని దేవుడు ఎక్కడా చెప్పలేదు. కానీ అన్‌ఫాల్ సురాలో అల్లాహ్ వద్ద గొప్ప ప్రతిఫలమున్న దని చెప్పినట్లు, గీతలో కూడా దేవుడు ప్రతి ఫలముగా వాని యోగము యొక్క క్షేమమును వహించునని తెలిపాడు.

దేవుడు భూమిమీద మానవులను సృష్ఠించి జీవితమును ఇచ్చి దానిలో స్వర్గ నరకములను కూడా ఇచ్చాడు. మనిషి స్వర్గ నరకముల మధ్యలో జీవితము గడుపునట్లు, స్వర్గ నరకములు కర్మల వలన (పాప పుణ్యముల వలన) వచ్చునట్లు ఏర్పాటు చేశాడు. సృష్ఠి ఆదిలోనే మనిషి మనుగడ ఎలా సాగాలో నిర్ణయించి, మహా ప్రళయము వరకు అదే పద్ధతి సాగునట్లు యంత్రాంగమును అమర్చాడు. మనిషి మహా ప్రళయము వరకు జీవితమును సాగించునట్లు చేసిన దేవుడు, మనిషి ధరించిన శరీరము మరణములో నశించునట్లు చేసి, తిరిగి క్రొత్త శరీరమనుదానిని (సమాధి అను దానిని) అందరికీ సమానముగా ఆదినుండి లభించునట్లు చేసి, ఆ క్రొత్త శరీరముతో మరణానంతర జీవితము గడుపుటకు ఆ శరీరమునుండి

(ఆ సమాధి నుండి) దేవుడు జీవున్ని లేపుచున్నాడు. అలా మొదటి సమాధి నుండి లేపబడినవాడు జీవితములో స్వర్గ నరకములను అనుభవిస్తూ పోయి కొంతకాలము నకు శరీరమార్పు కొరకు మరణించడము జరుగుచున్నది. అలా మరణించిన వాడు తిరిగి క్రొత్త శరీరములో లేపబడడము సర్వ సాధారణముగా జరుగుచున్నది. శరీరమార్పు కొరకు చనిపోయిన వ్యక్తి తిరిగి నగ్నముగా తయారైన, ఏ గుణ ధ్యాసలు లేని క్రొత్త శరీరములో పుట్టుచున్నాడు. ( ఈ విషయము ఇంకా పూర్తిగా అర్థము కావాలంటే మా రచనలలోని **"జనన మరణ సిద్ధాంతము"** అను గ్రంథమును చదవండి) క్రొత్తగా తయారైన శరీరమును సమాధి అంటున్నాము. జీవుడు తల్లిగర్భము నుండి పుట్టునని అందరూ అనుకొనుచుందురు. కానీ తల్లిగర్భమునుండి ఏ వ్యక్తీ ఇంతవరకూ పుట్టలేదు. తల్లిగర్భములో పూర్తి తయారైన శరీరము ప్రసవింపబడిన తర్వాత అందులోనికి జీవుడు ప్రవేశించి పుట్టడము జరుగు చున్నది. తల్లిగర్భము నుండి శిశు శరీరము పుట్టినది గానీ, జీవాత్మ పుట్టలేదు. జీవాత్మ, ప్రసవింపబడిన క్రొత్త శరీరమును చేరినపుడే అ శరీరమును సమాధి అనవచ్చును. శిశుశరీరములోనికి జీవాత్మ ప్రవేశించనంత వరకు ఆ శరీరము సమాధి అనబడదు. మొదటి శ్వాసతో జీవుడు చేరడము జరుగుచున్నది. అలా చేరిన జీవుడు మొట్టమొదట అ శరీరమునుండి లేపబడుచున్నాడు. జీవుడు మరణించిన క్షణమే ఆ జీవుని పాపపుణ్యములను అనుసరించి మరణానంతర జీవితమూ, అందులో అనుభవించవలసిన స్వర్గ నరకములూ నిర్ణయించ బడడము జరిగిపోవును. క్షణ కాలములోనే జీవుడు ప్రసవింపబడిన క్రొత్త శరీరమును చేరుచున్నాడు. అందులోనుండి తన శరీరము మీద ధ్యాస లేకుండా లేపబడుచున్నాడు. మరణించినపుడు జీవాత్మ పాతశరీరమును వదలి క్రొత్త శరీరమును చేరడము, మరణాంతర

జీవితమునకు తగిన కర్మ (ప్రారబ్ధకర్మ) నిర్ణయింపబడడమూ, క్రొత్త శరీరము నుండి (సమాధినుండి) లేపబడడమూ అంతయు క్షణకాలములో జరిగి పోవును. ఇది ఇంతవరకు ఎవరకీ తెలియని రహస్యము. సర్వాధికారియైన దేవుని చేత మనకు తెలియబడినదని భావించవలెను. అంతేకాక ఈ విషయమును సత్యాన్వేషణ బుద్ధితో చూడవలెను. ఇది సత్యమే కావున చివరికి ఎవరైనా గ్రహించవచ్చును.

ఇదంతా చెప్పుటకు కారణము సమాధియొక్క అసలు రూపము అర్థమగుటకేనని తెలియవలెను. సమాధి యొక్క అసలు రూపము అర్థమై నపుడు దేవుడు చెప్పిన జ్ఞానము ప్రకాశవంతమై పోగలదు. అది ఎదురాడని జ్ఞానమై పోగలదు. ఆయన మాటముందర ఏ ప్రశ్నారాదు. ప్రశ్న లేనిదే దేవుని జ్ఞానము. దేవుని జ్ఞానము సంపూర్ణముగా తెలిసి దాని ప్రకారము ఆచరిస్తూ ప్రపంచ సమస్యలకు భయపడని వాడు దేవుని సాన్నిధ్యమైన పరలోకము (మోక్షమును) చేరును. అటువంటి వానికి జీవితము అవసరము లేదు, సమాధి అవసరములేదు. వానికి మరణాంతర జీవితముండదు. ఏ జీవుడైనా పరలోకమును చేరనంతవరకు జీవితము చివరిలో మరణము పొందిన తర్వాత రెండవమారు శరీరమును ధరించడము జరుగుచుండును. అనగా మరణాంతర జీవితమును పొందుచుండును. అట్టివారు పూర్తి మరణమును పొందక, అట్లే పూర్తి పుట్టుకను పొందక రెండిటి మధ్యలో జీవితములలోనే ఉండును. జీవితములో ఎప్పుడూ సుఖదుఃఖములు తప్ప ఏమీ ఉండవు. అందువలన జీవితమును నరకాగ్ని అని చెప్పుచున్నారు. నరకాగ్నియను దానిని (జీవితము అను దానిని) పొందిన వాడు పరలోకమును పొందక ఏదో ఒక శరీరముతో, ఏదో ఒక జీవితమును గడుపుచుండవలెను. అతను చావకుండా ఉండలేడు, అట్లే పుట్టకుండా

ఉండలేదు. అంటే అతను చస్తూ ఉండవలసిందే, అట్లే తిరిగి పుట్టుతూ ఉండవలసిందే. ఇదే విషయమును 87వ సురా అయిన అల్అలా లో 12వ ఆయత్నందు **"అతను మహాగ్నిలోనికి పోతాడు. అందులో అతను చావనూలేదు, బ్రతకనూ లేదు"** అని చెప్పియున్నారు. అటువంటి వానికి శరీరములు మారుచున్నప్పటికీ వాడు నిత్యము నరకములో ఉన్నట్లే అగును. పరలోకములో కాకుండా ఇహ లోకములో ఉండువానికి ప్రతి క్రొత్త శరీరము సమాధియగును. అతడు శరీర ప్రళయమును పొందినప్పుడంతా శరీర సమాధినుండి లేపబడుతాడు.

ఇదంతయు ఇప్పటికాలములో చదివే వారికీ, వినేవారికీ క్రొత్తగ కనిపించినా ఇది ముమ్మాటికి సత్యము. ఇది సత్యమైనా శరీరమను సమాధినుండి మనిషి మరణము తర్వాత లేచినపుడు, శరీరములోనున్న జీవునికి ఏ ధ్యాసలు లేని దానివలన, ఇప్పుడు మేము చెప్పుచున్న విషయము సత్యమా అసత్యమా అని యోచించవలసి వచ్చును. ఈ విషయములో మాయ (సాతాన్ లేక సైతాన్) ముందే తప్పుదారి పట్టించిన దానివలన మా మాటను నమ్ముటకు అందరూ వెనుకాడవచ్చును. మా మాటలకు బలమును చేకూర్చుటకూ, అందరూ యోచించుటకు అవకాశముగా దేవుడు సమాధినుండి మనిషిని ప్రతి దినము బయటికి వచ్చునట్లు చేశాడు. దీనివలన ప్రజలు సత్యమును గ్రహించుటకు, దేవుని మాట శాసనమని అర్థమగుటకు వీలుకల్గుచున్నది. అదెలా అనగా! మనిషి మరణమును పొందుట అందరూ చూస్తున్న ప్రత్యక్ష సత్యము, అలాగే పుట్టుట కూడా ప్రత్యక్షముగా జరుగునదే, మరణము, జననము రెండూ ప్రత్యక్ష ప్రమాణములే అయినా, మరణములో ఏమి జరుగుచున్నదో అట్లే జననములో ఏమి జరుగుచున్నదో ఎవరికీ వాటి అనుభవము మాత్రము తెలియదు. ఈ

విషయము సామాన్య ప్రజలకే కాకుండా భౌతిక విషయములు, శరీర భాగములు, రోగములు తెలిసిన డాక్టర్లకు సహితము తెలియదనియే చెప్పవచ్చును. అందరికీ ఎలా తెలియదో అప్పుడు జరుగుచున్నదేమిటో ఇప్పుడు వివరముగా చెప్పాలంటే వీలుపడదు. ఈ విషయములన్నీ “జనన మరణ సిద్ధాంతము” అను గ్రంథమున వ్రాసియుంచాము. ఇటు చావులో గానీ, అటు పుట్టుకలోగానీ మనిషికి ఏ ధ్యాస లేని దానివలన, తర్వాత చెప్పుటకు ఆ సమయములోని జ్ఞాపకము లేని దానివలన, అందరికీ ఆ రెండు విషయములూ అగమ్య గోచరములే. అయితే దేవుడు ఈ రెండు విషయములను మనిషి ఆలోచించి తెలుసుకొనుటకు అన్ని ధ్యాసలున్న సమయములో వాటి నమూనాను మనిషికి అమర్చాడు. **మరణమునకు జననమునకు నమూనాగా ఉన్నవే, ప్రతి నిత్యమూ సంఘటనలుగా సంభవించుచున్న నిద్ర మెలుకువలు.**

తెలివున్న వానికీ, తెలివి లేనివానికీ, మేధావులకూ, మూర్ఖులకూ అందరికీ ప్రతి దినము నిద్రవస్తున్నా అది మనిషి యొక్క ఆధీనములో లేదు. ఎప్పుడు వస్తుందో, ఎలా వస్తుందో, వచ్చే సమయములో అనుభవము ఏమిటో ఎవరికీ తెలియదు. మరణము కూడా ఇలాంటిదే! ఎప్పుడు వస్తుందో, ఎలా వస్తుందో, వచ్చిన సమయములో అనుభవము ఏమిటో ఎవరూ చెప్పలేరు. ఇకపోతే మనిషియొక్క పుట్టుకలో ఏమి జరుగుచున్నదో, జీవుడు శరీరములోనికి ఎప్పుడు ప్రవేశిస్తున్నాడో, ఎలా ప్రవేశిస్తున్నాడో, ఎలా లేపబడుచున్నాడో, ఎవరి చేత లేపబడుచున్నాడో ఎవరికీ తెలియదు. అలాగే ప్రతి దినము నిద్రనుండి లేవడము కూడా మనిషికి పూర్తి తెలియదు. నిద్రలో శరీరమునందు అణిగియున్న జీవుడు ప్రపంచ ధ్యాసలోనికి ఎలా లేవ(రా) గల్గుచున్నాడు? ఎవరు లేపుచున్నారు? అను విషయము కూడా పూర్తిగా

ఎవరికీ తెలియదు. వాస్తవానికి చావు పుట్టుకల నమూనాలుగా నిద్ర మెలుకువలను దేవుడుంచాడు. చావు పుట్టుకలు ఎవరికీ అర్థముకాని అత్యంత రహస్యమైనవి. అటువంటివి మానవునికి తెలియాలి అంటే వాటి నమూనాను చూచి తెలియవలసిందే. అందువలన **చావు పుట్టుకల రహస్యములు తెలియుటకు దేవుడు నిద్ర మెలకువలను ప్రత్యక్ష ప్రమాణము లుగా ఉంచాడు. ఈ విధానములో ఒక మరణము ఒక నిద్రలాంటిది, ఒక పుట్టుక ఒక మెలుకువలాంటిది.**

మొదట నిద్రను గురించి వివరించుకొని చూస్తాము. నిద్ర అనునది అందరికి సుపరిచయమైనదే. అయినా ఎవడుగానీ అది ఎప్పుడు వస్తున్నదో ఆ సమయమును చెప్పలేడు. నిత్యము మనిషికి నిద్ర వస్తున్నా అది ఖచ్చితముగా వచ్చిన సమయమును ఏ మేధావి కూడా చెప్పలేడు. ఎవరు పరిశోధించినా, ఎంత పెద్ద పరిశోధకులైనా, నిద్రవస్తుందని తెలుసుకొని, అది ఏ సమయములో వచ్చిందని మాత్రము చెప్పలేరు. నిద్ర వచ్చు సమయములో శరీరమందు మొదట ఏమి జరిగినదీ, తర్వాత ఏమి జరిగినదీ ఎవరికీ తెలియదు. శరీరమునందు నిద్ర సమయములో ఏ మార్పులు జరుగుతూ పోయి చివరకు మనిషి ఎలా నిద్రను పొందుచున్నాడో తెలియ గలిగితే, మనిషి మరణించు సమయములో శరీరమందు ఏమి జరుగు చున్నదో, ఏమి జరిగిన తర్వాత మనిషి మరణమును పొందుచున్నాడో తెలియవచ్చును. అలాగే నిద్రనుండి లేచు మనిషిలో ఏమి జరుగుచున్నదో, అతను ఎలా లేవగలుగుచున్నాడో తెలియగలిగితే దాని నమూనాలోనే జననము కల్గుచున్నదని తెలియవచ్చును. కొందరు నిద్ర మెలకువల విషయమును తెలుసుకోవడము సులభము కదా! అని అనుకోవచ్చును. వాటిని సులభముగా తెలుసుకొనుటకు ఎవరికీ సాధ్యపడదనియే చెప్ప

వచ్చును. అందువలన వేమన యోగి కూడా 'నిద్రలోని మర్మము తెలిసిన వాడు నిజయోగి' అన్నాడు. కొందరైతే నేనే నిద్రపోవుచున్నాను, నేనే మేల్కొనుచున్నాను అంటున్నారు. అలా ఎవరైనా భ్రమపడవచ్చును. కానీ నిద్ర మెలకువలలో ఎవరికీ స్వతంత్రత లేదు. ఇంతవరకు చావు పుట్టుకలకు నమూనా అయిన నిద్ర మెలకువల విషయమే అత్యంత రహస్యమై ఉండగా, దానికంటే పెద్ద రహస్యమైన చావుపుట్టుకల విషయము ఎవరికీ తెలియదనియే చెప్పవచ్చును.

ఎవరికీ తెలియదని చెప్పుచున్న నీకెలా తెలిసిందని నన్ను మీరు ప్రశ్నించవచ్చును. నాకు తెలిసిందని నేనింతవరకు ఎక్కడా చెప్పలేదు. అత్యంత గొప్ప రహస్యమైన జనన మరణములు నాకు తెలియదు. కానీ నాకు తోడుగా ఉన్నవానికి అన్నీ తెలుసునని చాలామార్లు చెప్పాను. ప్రతి దినము మనిషిని నిద్రలోనికి పంపువాడు మరియు మెలకువలోనికి లేపువాడు నా శరీరములో ఉన్నాడు. అతనికి తెలియని రహస్యము ఏదీలేదు. అతనితో నేను స్నేహము చేయుట వలన అతను తెలిపినది నేను మీకు తెలుపు చున్నాను. అందువలన ఏ బోధను చెప్పునప్పుడు గానీ, ఏ జ్ఞానమును వ్రాయునప్పుడుగానీ "మేము చెప్పునది ఏమనగా అనీ, మరియు మేము వ్రాయునది ఏమనగా" అనీ, వ్రాయుచుందుము. నాకే కాదు మీకు తోడుగానున్న వాడు, మీ శరీరములకు అధిపతిగా ఉన్నవాడు అందరి శరీరములలోనూ ఉన్నాడు. అయితే అతను ఒకడున్నాడనిగానీ, అతనే శరీరమునకు అధిపతి అనిగానీ, అతను చేయిస్తేనే అన్నీ జరుగుచున్నవనిగానీ తెలియక శరీరములోనే ఉన్నానని అనుకోవడము వలన నీలోని వాడు నీకు ఏమీ చెప్పడము లేదు. నీకు ఏమీ తెలియడము లేదు. మీకూ నాకు అంతే తేడా తప్ప ఏమీలేదు. ఆ తేడా వలన కొన్ని రహస్యములను నేను చెప్పగలుగుచున్నాను, మీరు చెప్పలేకున్నారు.

నిద్రనుండి ఎలా లేవగలుగుచున్నామో తెలియగలిగితే, సమాధి నుండి ఎలా లేవగలుగుచున్నామో తెలియగలదు. నిద్రపోయినవాడు శరీరమునుండి స్వయముగా లేవలేడు. అలాగే చనిపోయినవాడు స్వయముగా (సమాధి నుండి) లేవలేడు. నిద్రపోయిన వాడు పడుకొనియున్న శరీరమునుండి లేపబడుచున్నాడు. అలాగే చనిపోయిన వాడు తల్లిగర్భము నుండి బయట పడిపోయిన శరీరమునుండి లేపబడుచున్నాడు. నిద్రపోయిన వాడూ, చనిపోయిన వాడూ ఎవ్వరికీ తెలియకుండా శరీరములోనే ఉన్న వానిచేత లేపబడుచున్నాడు. నిద్రపోయిన వానికి తాను నివసించు పాత శరీరమే సమాధి కాగా, చనిపోయిన వానికి తాను నివసించబోవు క్రొత్త శరీరమే సమాధి అగుచున్నది. శరీరములో నిద్రపోయిన వానిని ఆ శరీరములో జీవాత్మకు తోడుగానున్న ఆత్మే శరీరము నుండి లేపుచున్నది. చనిపోయిన వానిని వాడు (ఆత్మ, జీవాత్మ) చేరిన క్రొత్త శరీరము నుండి ఆత్మే జీవాత్మను లేపుచున్నది. ఇక్కడ కొందరు ఒక ప్రశ్నను అడుగవచ్చును. అదేమనగా! క్రొత్తగా పుట్టినప్పటి విషయము మాకు తెలియదు. కానీ నిద్రపోయిన వానిని మేము ఎప్పుడు లేపితే అప్పుడు వాడు నిద్రనుండి లేస్తున్నాడు. అటువంటపుడు నిద్రపోయిన మనిషిని మెలకువలోనున్న మరొక మనిషి లేపుచున్నపుడు, ఇది అందరికీ తెలిసిన విషయమైనపుడు మీరేమో నిద్రపోయిన వానిని, వాని శరీరములోని ఆత్మే లేపుచున్నదని చెప్పుచున్నారు. మీ మాట పచ్చి అబద్ధము కాదా! అని అడుగవచ్చును. నామాట అబద్ధమైతే మీరు ఈ ప్రశ్నను అడిగినా దానికి జవాబు చెప్పకుండా దానిని దాటవేసి పోయేవాడిని. నా మాట అబద్ధము కాదు. కాబట్టి మీరు అడుగకున్నా ఆ ప్రశ్నను నేనే రెకేత్తించి ఎవరైనా ఇట్లు అడుగవచ్చునని ప్రశ్నించాను. దానికి జవాబును కూడా చెప్పుచున్నాను. ఇక్కడ ప్రశ్న జవాబు రెండు నావే అయినా, ప్రశ్న మీ ప్రక్కదీ, జవాబు నా ప్రక్కది.

నిద్రపోయిన వానిని మరొకడు లేపినప్పుడు నిద్రపోయిన వాడు లేచినా, పైకి వీడు లేపితే వాడు లేచినట్లు కనిపించినా, శరీరములోపల లేపినవాడు మాత్రము ఆ శరీరములోని ఆత్మే. ఆత్మ తన ఉనికిని బయట మనిషి గ్రహించనట్లు, బయటివాడు పిలిచినపుడు లోపలి ఆత్మ ఆ శరీరము లోని జీవున్ని మేల్కొలుపుచున్నది. నిద్రలోనున్న జీవునికి బయట శబ్దముగానీ, బయట స్పర్శగానీ తెలియదు. వినికిడే లేనివానిని పిలిస్తే ఆ మాట వానికి వినిపించదు, అలాగే తట్టినా, ఆ స్పర్శ వానికి (జీవునికి) తెలియదు. అటువంటపుడు నిద్రపోవువానిని బయటివాడు పిలిచినా, తట్టినా వాడు లేచుటకు అవకాశము లేదు. అయితే నిద్ర పోయిన వానిని బయటివాడు పిలిచినపుడు, ఆత్మజ్ఞానము తెలియని వానికి ఆత్మ తెలియబడడము ధర్మ విరుద్ధమగును, కావున ఆత్మ ఒకటున్నదని తెలియనట్లు, ఆత్మే నిద్రపోయిన వానిని లేపి, బయటివాడు నేను లేపితే లేచాడు అను భ్రమలోపడునట్లు చేయుచున్నది. ఒక్కొక్కమారు ఎవరు పిలిచినా నిద్రనుండి లేవని వారిని కూడా చూడవచ్చును. అలాగే తట్టినా లేవని వానిని కూడా చూడవచ్చును. శరీరమునకు అధిపతి, ఆ శరీరములోని ఆత్మే కావున ఆత్మ ప్రమేయము లేకుండా ఏమీ జరుగదు. ఆత్మ శరీరములో ఉంటూ మనిషికి ఇష్టమొచ్చినట్లు శరీరమును కొన్ని కార్యములందు నడిపించుచూ, శరీరమునకు నేనే అధిపతినని అనుకొన్నట్లు ఆ శరీరములోనున్న జీవున్ని భ్రమింప జేస్తున్నది. అటువంటి పనులు కొన్నిటిని జీవుని ఇష్టమునను సరించి ఆత్మ చేయుచుండుట వలన, మనిషి నా శరీరము నా ఇష్టము అంటున్నాడు. తనకు శరీరము మీద ఏ అధికారము లేకున్నా మనిషి ఇచ్ఛకు ఆధీనములో వుండి జరుగు ఇచ్ఛాధీన కార్యములను చూచి మనిషి నా ఇష్టము అంటున్నాడు. మనిషిని భ్రమింపజేయు ఇచ్ఛాధీన కార్యములే కాకుండా, శరీరములో మనిషి ప్రమేయము లేకుండా, మనిషి ఇచ్ఛ లేకుండా, మనిషికి

తెలియకుండా జరుగు పనులు ఎన్నో గలవు. అయితే మనిషి తన అజ్ఞానము చేత వాటిని గురించి ఎవరు చేస్తున్నారని యోచించడము లేదు. మన శరీరములలో అనిచ్ఛాధీనముగా జరుగు కార్యములు ఎన్నో కలవు. చేయిని, కాలును మనిషి ఇష్టము ప్రకారము ఆత్మ పని చేయుంచుట వలన, ఆ పని తన ఇష్టము ప్రకారము జరుగుచున్నదనీ, తానే చేయుచున్నాననీ మనిషి అజ్ఞానము చేత అనుకొంటున్నాడు. ఒక్కొక్కప్పుడు మనిషి యొక్క కాలుగానీ, చేయిగానీ మనిషి ఇష్టము ప్రకారము పని చేయకుండా పోవును. అప్పుడు చేయిని, కాలును మనిషి కొద్దిమాత్రము కూడా కదిలించలేడు. అన్నీ బాగుండీ కాలు పని చేయనప్పుడు దానికి రోగము వచ్చిందని అనుకొంటున్నాడు తప్ప, దీనికి మూల కారణమేమని అప్పుడు కూడా యోచించడము లేదు. శరీరములో ఎంతో రహస్యము దాగి ఉన్నదనీ, ఆధ్యాత్మికమంతా (ఆత్మ ఆధ్యయనమంతా) శరీరములోనే ఉన్నదనీ మనిషికి తెలియకుండా పోయిన దానివలన ప్రవక్తలు చెప్పిన జ్ఞానమును శరీరములో చూచుకోక బయట ప్రపంచములో చూస్తున్నారు. అందువలన ప్రవక్తలు చెప్పిన జ్ఞానము అర్థము కాకుండా పోయినదని చెప్పవచ్చును.

భగవద్గీతలోని జ్ఞానముగానీ, బైబిలులోని వాక్యములను గానీ, ఖురాన్‌లోని ఆయత్‌లను గానీ, కొన్నిటిని అంతరంగములోనే చూచు కోవలసిన అవసరమున్నది. బయట జీవన విధానములు పెద్దలు చెప్పి యుంటే వాటిని బయటి ప్రపంచములోనే అర్థము చేసుకొని ఆచరించాలి. అవి అన్నియు నీతి న్యాయములకు సంబంధించిన విషయములుగా ఉండును. శరీరములోపలి జీవుని విధానమును చెప్పియుంటే వాటిని శరీరములోపలి విషయములుగా అర్థము చేసుకొని అచరించవలెను. అంతరంగమందు అర్థము చేసుకొని ఆచరించునవి అన్నియు జ్ఞానము,

ధర్మములుగా ఉండును. **ప్రపంచ సంబంధ నీతి న్యాయములకంటే పరమాత్మ సంబంధ జ్ఞాన ధర్మములు ఎన్నో రెట్లు గొప్పవి.** అందువలన దైవ జ్ఞానమునూ, దైవధర్మములను అంతరంగములో అవగాహన చేసుకొంటే జీవునికి సమాధి శరీరములో ఉన్నదనీ, శరీరమునకు సమాధి (గోరీ) బయట ప్రపంచములో ఉన్నదనీ తెలియుచున్నది. ప్రవక్తలు చెప్పిన జ్ఞానమంతయు చైతన్యవంతమైన జీవాత్మను గురించియే గానీ, చైతన్యములేని జడమైన శరీరమును గురించి కాదు. అందువలన జీవాత్మవున్న శరీరమును (సమాధిని) గురించియే చెప్పుకోవలెను. జీవాత్మ లేని శరీరమును (శవమును) గురించి చెప్పుకోకూడదు.

ఇంతవరకు ప్రవక్తలు చెప్పిన సమాధి విషయములనే వివరించి చెప్పాము. ఇంకనూ వారు చెప్పకుండా వదలివేసిన విషయములు ఎన్నో ఉన్నవి. వాటన్నిటిని వారు చెప్పకుండా వదలివేశారు. ప్రవక్తలు చెప్పినవి కాకుండా ఇంకా కొన్ని జ్ఞాన విషయములున్నవని తెలియునట్లు పరిశుద్ధ బైబిలు గ్రంథములో యోహాను సువార్తలో 16వ అధ్యాయమునందు 12వ వచనము ఇలా గలదు. **"నేను మీతో చెప్పవలసినవి ఇంకా అనేక సంగతులు గలవు. కానీ ఇప్పుడు మీరు వాటిని సహింపలేరు."** అని ఏసు చెప్పినట్లు కలదు. అంతేకాక అదే బైబిలు గ్రంథమందు, అదే యోహాను సువార్త 14వ ఆధ్యాయమున 26వ వాక్యము ఇలా గలదు. **"ఆదరణకర్త అనగా తండ్రి నామమున పంపబోవు పరిశుద్ధాత్మ సమస్తమును మీకు బోధించి నేను మీతో చెప్పిన సంగతులన్నిటిని మీకు జ్ఞాపకము చేయును."** అని ప్రవక్త అయిన ఏసు చెప్పాడు. ఈ వాక్యములనుబట్టి తెలియునదేమనగా! ప్రవక్త కొన్ని జ్ఞాన విషయములే చెప్పాడనీ, చెప్పవలసినవి ఇంకా ఉన్నవనీ, అన్ని విషయములు చెప్పబడినప్పుడే సమస్తమును బోధించినట్లగునని

తెలియుచున్నది. ఎందరో ప్రవక్తలు ఇంత వరకు వచ్చిపోయినా, ఇంకా ప్రస్తావనకు రాని జ్ఞాన విషయములు ఎన్నో ఉన్నవనుటకు ఆధారములున్నవి. నేను ప్రవక్తను కాకపోయినా నాకు తెలిసినంతవరకు, ఇంతవరకు ప్రస్తావనకు రానివి, ప్రవక్తలు చెప్పని విషయములలో ఒకదానినైనా లేక కొన్నిటినైనా నాలోని ఆత్మ అందించిన వాటిని మీకు తెలియజేయాలని అనుకొంటున్నాము.

ఇంతవరకు సమాధి విషయములో ప్రవక్తలు చెప్పిన దానినే వివరించి చెప్పినాము. అయితే అది ఒక వింతగా, నమ్మలేని వివరముగా కనిపించియుండవచ్చును. అయినా హేతుబద్దముగా యోచిస్తే ఎవరికైనా మేము చెప్పినదే సత్యమని అర్థము కాలగలదు. నాకు నచ్చింది అని ఒక మనిషి అంటే అది ద్వంధ భావములకు దారి తీయగలదు. అతడు నాకు ఇష్టమైంది అని చెప్పి ఉండవచ్చును, లేక నాకు బాధ కల్గినది అని చెప్పి యుండవచ్చును. ఒకే వాక్యము రెండు అర్థములను ఇచ్చునది అయినపుడు సందర్భమును బట్టి అక్కడ ఏ అర్థము సరియైనదో గుర్తించవచ్చును. అక్కడ సందర్భమును గానీ, జరుగుచున్న సమయమును గానీ గుర్తించకుండా నచ్చింది అను పదమును మాత్రము చూస్తే అది బాధకలిగింది అని మాత్రమే అర్థమై ఉండవచ్చును. అట్లుకాకుండా సమయ సందర్భములను బట్టి చూస్తే ఒక వ్యక్తి పెళ్ళి చూపులకు పోయిన సందర్భములో పెళ్ళి కూతురును అందరి సమక్షములో చూచిన సమయములో నచ్చింది అను మాటవస్తే, ఆ మాటకు బాధకలిగింది అని అర్థము చేసుకొంటే అది అసందర్భ అర్థమగును. నచ్చింది అనుమాటకు బాధ కలిగిందను అర్థము ఉండినా, ఆ సమయములో ఆ అర్థము పనికిరాదు. అలాగే మూల గ్రంథములయందు ప్రవక్తలు, ప్రళయములో అని అన్నప్పుడు, అది ఏ ప్రళయమో సరిగా అర్థము చేసుకోకపోతే అక్కడున్న భావమంతా చెడిపోవును. ప్రకృతి చర

అచర అను రెండు ప్రకృతులుగా ఉన్నపుడు, రెండు ప్రకృతులకు ప్రళయమున్నపుడు అక్కడ ఏ ప్రకృతిని గురించి చెప్పారు? ఏ ప్రళయమును గురించి చెప్పారు అని యోచించకపోతే తప్పు భావము లోనికి పోవు అవకాశమున్నది. దివ్య ఖురాన్ గ్రంథములో హజ్రత్ మహమ్మద్ ప్రవక్త చెప్పిన జ్ఞాన విషయమును మొదట కొందరు తప్పు భావముతో అర్థము చేసుకొనుట వలన, వారి ద్వారా అదే అర్థము అంతటా ప్రాకి పోవడము వలన, ప్రవక్త ఏ ఉద్దేశ్యముతో చెప్పాడో ఆ ఉద్దేశ్యము లేక ఆ భావము ఎవరికీ తెలియకుండా పోయినది. దైవ సందేశములోని అసలైన సారాంశము, తర్వాత వచ్చు ప్రజలు గ్రహించుకొనుటకు వీలు లేకుండా పోయినది.

బైబిలు గ్రంథములో యోహాన్ సువార్తలో 16వ ఆధ్యాయము 12వ వచనము ప్రకారము దేవుని వాక్యములు ఇంకా అనేకములను ప్రవక్తలు చెప్పవలసియున్నా, వాటిని చెప్పలేదని తెలిసినది. కారణమును చూస్తే అదే వాక్యములో "ఇప్పుడు మీరు వాటిని సహింపలేరు" అనివుంది. అలా చెప్పుట వలన ప్రజలు ముందే తప్పు భావములో మునిగి పోయారనీ, నిజమును చెప్పినా ఆ విషయములను అర్థము చేసుకోలేరను భావముతో చెప్పకుండా పోయారనీ తెలియుచున్నది. అలా చెప్పకుండా వదలివేసిన అనేక జ్ఞాన సంగతులను మేము మా గ్రంథములలో కొన్నిటిని వివరించాము. ఇప్పుడు ఇంతవరకు ఎవరూ చెప్పని ఒక జ్ఞాన విషయమును తీసుకొని వివరించుకొందాము. జ్ఞాన విషయము క్రొత్తదైన దానివలన, తెలిసిన సత్యము కొందరికి ఆనందమునిస్తే, కొందరికి ఆసూయనిచ్చి వినిన విషయము ఏసుప్రభువు చెప్పినట్లుగా, సహించకుండా పోవచ్చును. అసూయ అను గుణమును ప్రక్కనపెట్టి చూస్తే మేము చెప్పిన జ్ఞాన విషయము

ఎన్నో ప్రశ్నలకు జవాబునిచ్చునదై క్రొత్త ఆనందమును కల్గించునదై ఉండును. దైవమునకు సంబంధించిన సమస్త విషయములను పరిశీలించి చూస్తే కాకిగూటిలో కోకిల గ్రుడ్డుపెట్టినట్లు, మాయ (సాతాన్) దేవుని ధర్మములలో తన ధర్మములను కలిపి ఉంచినది. కాకిగూటిలోని కోకిల గుడ్డును ఎవరూ గుర్తించలేనట్లుండుట వలన ఇది కాకి గ్రుడ్డని, ఇది కోకిల గ్రుడ్డని ఎవరూ చెప్పలేక కాకిగూటిలోనివన్నీ కాకిగ్రుడ్లే అనుచున్నారు. అదే విధముగా మాయ తన ధర్మములను ఎవరూ గుర్తించనట్లు దేవుని ధర్మములతో కలిపి ఉంచుట వలన ప్రజలు తమకు తెలిసిన ధర్మములలో ఏది దైవధర్మము, ఏది మాయ ధర్మము అని గుర్తించలేక తనకు తెలిసినవన్నీ దేవుని ధర్మములనుకొనుచున్నాడు. కొందరికేమో దేవుని ధర్మములు మాయ ధర్మములుగా, మాయ ధర్మములు దేవుని ధర్మములుగా కనిపిస్తున్నవి. కొందరిలోనేమో మాయ ధర్మములు బాగా ప్రచారమై పోయినవి. అటువంటి వారికి మేము చెప్పు దైవధర్మములు క్రొత్తగా కనిపించడమే కాకుండా అసూయను కల్గించి సహింపనట్లు చేస్తున్నవి.

ఏది ఎట్లున్నా, ఎవరు ఏ విధముగా అర్థము చేసుకొన్నా మేము (నేను + నా ఆత్మ) మాత్రము తప్పనిసరిగా సత్యమునే బోధించుచుందుము. ఏ మతములోనైనా దేవుని వాక్కులకు భావ లోపములు ఏర్పడినపుడు వాటిని సవరించి అసలైన భావమిది అని చెప్పడము మా కర్తవ్యము. అందువలన మేము హిందూ (ఇందూ) మతములోనే కాకుండా క్రైస్తవము, ఇస్లామ్ మతములలోని దైవసందేశములకు భావ లోపము ఏర్పడకూడదనీ, అట్లు ఏర్పడివుంటే వాటికి నిజ భావమును తెలిపేదానికి ప్రయత్నిస్తాము. అటువంటి ప్రయత్నములోనిదే సమాధి యొక్క వివరమును చెప్పడము జరిగినది. ప్రకృతితో కూడిన శరీరముతో పరమాత్మ భాగమైన ఆత్మ,

జీవాత్మ కలసిన సజీవ శరీరమును సమాధి అని అనవచ్చునని కూడా చెప్పుకొన్నాము. ప్రపంచములో పుట్టిన జీవరాసులందరికీ శరీరమునిచ్చిన ప్రకృతి తల్లి వంటిదనీ, శరీరములో చైతన్యమునిచ్చిన పరమాత్మ తండ్రివంటి వాడని కూడా చెప్పుకొన్నాము. మీకు మొదట అర్థమయ్యే దానికి ప్రకృతి తల్లి వంటిదని, పరమాత్మ తండ్రివంటివాడని మొదట చెప్పినా జన్మజన్మలకు నిజమైన తల్లి తండ్రి ప్రకృతి పరమాత్మయే. ఇదే విషయమునే భగవద్గీత గుణత్రయ యోగము అను ఆధ్యాయములో 3,4 శ్లోకములందు

*శ్లో* ॥***3.*** *మమయోని ర్మహద్ర్బహ్మ తస్మిన్ గర్భమ్ దధామ్యహమ్,*
*సంభవ స్సర్వ భూతానామ్ తతో భరతి భారత ॥*

*శ్లో* ॥***4.*** *సర్వయోనిషు కౌంతేయ! మూర్తయః సంభవంతి యాః*
*తాసాం బ్రహ్మ మహద్యోనిః అహం బీజ ప్రదః పితా ॥*

**భావము :** అచేతన ప్రకృతి నాకు భార్యలాంటిది. దానికి నేను భర్తగా, బీజదాతగా ఉన్నాను. అందువలన మా ఇద్దరికి సమస్త జీవరాసులు పుట్టుచుందును. బయటి ప్రపంచములో ఏ యోనినుండి (ఏ గర్భమునుండి) ఏ ఆకారముతో పుట్టినా, సకల జీవరాసులకు శరీరమునిచ్చిన తల్లి ప్రకృతికాగా, దానికి బీజదాతనైన నేను (పరమాత్మ) తండ్రియని తెలియవలెను.

ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. ప్రకృతివలన శరీరము తయారగుచున్నది. పరమాత్మ ప్రకృతికి బీజమును ఇస్తున్నాడు. అందువలన తల్లి ప్రకృతి, తండ్రి పరమాత్మ అని తెలిసినది. ఇది మనుషులు చెప్పినది కాదు, దేవుని సందేశము. అయితే ఇప్పుడు ఒక ప్రశ్న మనకు రావచ్చును. అదేమనగా! ఈ మధ్య సంవత్సరము క్రిందట క్రొత్తగా పెళ్లయిన జంటకు క్రొత్తగా కొడుకు పుట్టాడు. ఆ బాలుని తండ్రి 'నా కొడుకు నామకరణమునకు

అందరూ హాజరై దీవించి పోవలసినదిగా' ఆహ్వాన పత్రికను అచ్చువేయించి పంచాడు. అతనేమో నాకొడుక్కు పేరు పెట్టుచున్నామంటున్నాడు. ఇక్కడేమో భగవద్గీతలో ఎవని కొడుకైనా వాడు నా కొడుకే అని దేవుడు చెప్పడము జరిగినది. ఏది నిజము అని యోచిస్తే, మనము చూస్తున్నట్లే పెళ్ళి చేసుకొని భార్యతో భర్త కాపురము చేసి కొడుకును కన్న తండ్రి తల్లులు వీరే. వీరు పెళ్ళి చేసుకొన్నదీ, దాంపత్య జీవితము గడిపినదీ, సంతానమును పొందినదీ వీరేనని ప్రత్యక్షముగా మనకు తెలుసు. అయితే ఏ భార్యకు ఎవడు మొగుడైతే నాకేమి, పుట్టినవాడు నా కొడుకే అనడము దేవునికి న్యాయమా? అని ఎవరైనా అడగవచ్చును. దానికి ఇపుడు జవాబు చెప్పవలసినది మేమేగా! చెప్పుతాము వినండి. ఒకరు ఎవరితోనైనా మాట్లాడునపుడు 'ఆ నా కొడుకు, ఈ నాకొడుకు' అని ఎవరినైనా అనుచుందురు. వాడు చేసిన మోసము పెద్దది అనబోయి, ఆ నాకొడుకు చేసిన మోసము పెద్దది అనుచుందురు. ఎవరినైనా దూషించేటప్పుడు నా కొడకా అని అనుచుందురు. కొందరు తెలియకుండానే ఇతర వ్యక్తిని నాకొడకా అని అనడము జరుగుచున్నది. వాస్తవానికి దూషించే వ్యక్తికి ఎదుట వ్యక్తి కొడుకు కాకున్నా ఆ మాట అనడము న్యాయమా అని అడిగితే న్యాయము కాదనియే, అట్లనడము సరియైన పద్ధతికాదనియే చెప్పవచ్చును. బయట వ్యక్తి మరొక వ్యక్తిని నా కొడకా అని అంటే అది అన్యాయము అయినపుడు, అంత పెద్ద దేవుడు, భార్యభర్తలకు అన్ని ఆధారములతో పుట్టిన శిశువును నా కొడుకు అనడము పెద్ద అన్యాయమగును అని ఎవరైన అనవచ్చును. అయితే దైవ ధర్మముల ప్రకారము చూస్తే న్యాయము అన్యాయమూ, నీతి అవినీతి ప్రపంచములో జీవనము సాగించువారికి మాత్రమే వర్తించును. దేవునికి నీతి న్యాయములు వర్తించవు. ఆయనకు వర్తించునవి జ్ఞానము ధర్మములు మాత్రమే. అందువలన ఇతరులకు పుట్టిన వానిని దేవుడు నా కొడుకు

అనడము జ్ఞానమా? ధర్మమా? అని అడగవచ్చును. కానీ నీతియా న్యాయమా అని అడగకూడదు. సరే భగవద్గీతలో దేవుడు అందరికీ తల్లి ప్రకృతి, తండ్రిని నేను అని అనినపుడు ఇది ధర్మమా? అని అడగవచ్చును.

భూమిమీద ఎవరు ఎవరికి పుట్టినా వానికి తండ్రిని నేనే అని చెప్పడము, చూచే దానికి అధర్మముగా కనిపించినా వాస్తవానికి ఆయన చెప్పిన మాట ధర్మమేనని చెప్పవచ్చును. దేవుని మాట ధర్మమని చెప్పుట వలన ఇతను అసత్యవాదియని నన్ను మీరనుకొనినా ఫరవాలేదు. కానీ ధర్మబద్ధముగా దేవుడు ప్రతి మనిషికీ, ప్రతి జీవరాసికి తండ్రి అనియే చెప్పవచ్చును. ఇదే విషయమునే బైబిలులో మత్తయి సువార్త 9వ వాక్యములో ఇలా ఉన్నది. "భూమిమీద ఎవనినైననూ తండ్రి అని పేరుపెట్టి పిలువవద్దు. ఒక్కడే మీ తండ్రి, ఆయన పరలోకమందున్నాడు." ఈ మాటను ఏసు స్వయముగా చెప్పాడు. బైబిలులో ఏసుప్రవక్త చెప్పినది, భగవద్గీతలో అందరికి బీజదాతనైన నేనే తండ్రినని చెప్పిన దానికి సరిపోయింది. కనిపించే తల్లి తండ్రుల విషయమునకువస్తే సామాజిక జీవితములో కనిపించే తల్లి తండ్రి ఉన్నా ఆధ్యాత్మిక విధానములో ప్రతి జన్మకు తల్లి తండ్రి కనిపించకుండా ఉన్నారు. కనిపించే తల్లి తండ్రి ప్రస్తుత జన్మకే తల్లితండ్రులు కాగా, ప్రకృతి పరమాత్మలు అన్ని జన్మలకూ, అందరికీ తల్లి తండ్రులుగా ఉన్నారు. ప్రకృతి పరమాత్మలను వారు నిజమైన తల్లితండ్రులుగా ఉన్నారనుమాట కొందరు వినినా వారిలో ఏమాత్రము స్పందనగానీ, క్రొత్త విషయము తెలిసినందుకు ఆశ్చర్యముగానీ కలుగక చెప్పిన వానివైపు దీనముగా చూచెదరు. చెప్పేవారు మతిస్థిమితము లేనివానిగా కనిపించుట వలన వారు విన్న విషయమును గురించి పట్టించుకోరు. ఎందుకనగా! ఆ మాట అసత్యమనీ, చెప్పేవానికి మతిపోయిందనీ జాలిగా చూస్తారు. ఇంకా కొందరు ప్రకృతి పరమాత్మ

అనువారు కూడా మనుషులే అని అనుకొని, వారు కని, వీరికి ఇచ్చారేమో ప్రస్తుతమున్న వారు పెంచిన తల్లి తండ్రులేమో అని అనుకోవడము జరుగుచున్నది. కొందరు విజ్ఞానులైతే సైన్సు పరిశోధన ప్రకారము తండ్రి వీర్యకణము వలన, తల్లి అండము వలన మనిషి పుట్టివుంటే, కణముగానీ, అండముగానీ లేని వారిపేరు చెప్పడము ఏమిటియని హాస్యాస్పదముగా మాట్లాడుదురు. ఈ విధముగా మూల గ్రంథములలో దేవుడు చెప్పిన మాటను చెప్పినా ప్రజలు వినే స్థితిలో లేరు. చెప్పిన వానిని మూఢనమ్మ కస్తునిగనో, బుద్ధి హీనునిగనో అనుకోవడము జరుగుచున్నది.

ఎవరు ఏమనుకొనినా, ఎన్ని విధముల చూచినా నిజానికి ప్రకృతి వలన శరీరమూ, పరమాత్మ వలన కదలిక శక్తి, జీవుడు ఏర్పడడము వలన ప్రకృతి తల్లి, పరమాత్మ తండ్రియగుట వాస్తవమైన మాటయేకాక శాస్త్ర సమ్మతమైనదనీ, ధర్మయుక్తమైనదీ అనికూడా తెలియుచున్నది. కల్పించుకొని మాట్లాడడము వేరు, శాస్త్రబద్ధముగా మాట్లాడడము వేరు. ఉదాహరణకు చెప్పుకొంటే అష్టాదశ (18) పురాణములు కల్పించుకొని చెప్పినవి. అవి శాస్త్రములుకావు, కొన్ని అబద్ధములనూ, కొన్ని నిజములను అల్లి చెప్పినవి పురాణములు. శాస్త్రములు అటువంటివికావు, శాస్త్రము సత్య స్వరూపముతో కూడివుండును. శాస్త్రము శాశ్వితము. ఎప్పటికీ మారునది కాదు. భూమిమీద ఆరు శాస్త్రములే ఉన్నవి. అందులో అన్నిటికంటే గొప్పదీ, అన్నిటికంటే ముందు పుట్టినదీ బ్రహ్మవిద్యా శాస్త్రము. అయితే మొదటినుండి వరుస క్రమములో చివరిలో చెప్పబడుచున్నది. మిగత ఐదు శాస్త్రములు తర్వాత పుట్టినవైనప్పటికీ వరుస క్రమములో ముందు చెప్పబడుచున్నవి. శాస్త్రములు ఆరు ఇలా వరుసగా గలవు. 1) గణిత శాస్త్రము 2) ఖగోళ శాస్త్రము 3) రసాయన శాస్త్రము 4) భౌతిక శాస్త్రము 5) జ్యోతిష్య శాస్త్రము

6) బ్రహ్మవిద్యా శాస్త్రము. ఆరవ శాస్త్రమైన బ్రహ్మవిద్యా శాస్త్రమును యోగశాస్త్రము అనికూడా అనవచ్చును. మనిషి యొక్క జనన మరణములూ, కర్మ విధానములూ, ఆత్మ అధ్యయనములూ, జీవాత్మ అనుభూతులూ అన్నియు బ్రహ్మవిద్యా శాస్త్రమునకు సంబంధించి ఉండును. అందువలన ఆధ్యాత్మిక ములో ఉన్నవన్నియు శాస్త్రబద్ధమైనవే ఉండును. ఒకవేళ ఎవరైనా ఆధ్యాత్మికము కాని విషయములను ఆధ్యాత్మికమే అని చెప్పినా అవి సత్యము కావు, శాస్త్రబద్ధము కానివిగా ఉంటాయి. కొన్ని చోట్ల దైవజ్ఞాన విషయము లలో మాయ జ్ఞానము కూడ కలిసిపోయి ఎవరూ గుర్తించలేనట్లుండినా బ్రహ్మవిద్యా శాస్త్రమును తెలిసినవారు, శాస్త్రబద్ధముగాని మాయ జ్ఞానములను వెంటనే గుర్తుపట్టవచ్చును. ఈ విధానముతోనే దైవ సందేశములైన మూల గ్రంథములలో కాకిగూటిలో కోకిలగుడ్లు కలిసిపోయినట్లు, దొంగగా కలిసి పోయిన మాయ జ్ఞానమును కూడా కనిపెట్టి వాటిని తీసివేయవచ్చును. మేము వ్రాసిన **"త్రైతసిద్ధాంత భగవద్గీత"** లో మాయాజ్ఞాన శ్లోకములను తీసివేసి వ్రాయడము జరిగినది.

బ్రహ్మవిద్యాశాస్త్రము ప్రకారము ఒక జీవునికి తల్లి ప్రకృతి, తండ్రి పరమాత్మ అనుమాట శాసనము మరియు వాస్తవము. అయితే మనము చూస్తున్నట్లు అందరూ, కనిపించే తల్లి తండ్రులకే పుట్టినట్లు తెలియుచున్నది. కానీ ప్రకృతి పరమాత్మలకు పుట్టునట్లు ఎక్కడా ప్రత్యక్షముగా తెలియడము లేదే అని అడగవచ్చును. ఈ ప్రశ్నకు మా సమాధానము చెప్పుటకు ముందు ఒక ఉదాహరణను చెప్పుకొందాము. మేము 1980వ సంవత్సరము **"జనన మరణ సిద్ధాంతము"** అను ఒక సంచలనాత్మక గ్రంథమును వ్రాయడము జరిగినది. అది అన్ని గ్రంథములవలె సాధారణమైన గ్రంథము కాదు. ఎవరికీ తెలియని చావు పుట్టుకల విషయములను సిద్ధాంతముగా వ్రాసిన

గ్రంథమది. ఆ ఒక్క గ్రంథమును వ్రాయుటకు 45 రోజులు పట్టింది. ఆ గ్రంథమును వ్రాయుటకు ఎంతో యోచన చేయవలసి వచ్చినది. అట్లే ఎన్నో ఆధారములను సేకరించి వ్రాయవలసి వచ్చినది. అలా 45 రోజులు కష్టపడితే ఒక ప్రతిని తయారు చేయగలిగాము. అప్పుడు అది "జనన మరణ సిద్ధాంతము" అను ఒక గ్రంథముగా పూర్తి తయారైనది. తర్వాత అటువంటి గ్రంథములను కొన్ని వేల సంఖ్యలో తయారు చేయుటకు, మొదట రచయిత చేత వ్రాయబడిన గ్రంథమునకు నమూనాను తయారు చేసి దానివలెనున్న ఎన్ని జనన మరణ సిద్ధాంత గ్రంథములనైనా తయారు చేయవచ్చును. ఒకమారు వ్రాసిన తర్వాత అట్లే శ్రమపడి మిగతా అటువంటి గ్రంథములను వ్రాయవలసిన అవసరములేదు. మొదటి గ్రంథము యొక్క నమూనాను తయారు చేసుకొని, ఆ నమూనా ప్రకారము 45 రోజుల్లో 45 వేల గ్రంథములనైనా తయారు చేయవచ్చును. అయితే ఇక్కడ మొదట వ్రాయబడినది వ్రాసిన గ్రంథముకాగా, తర్వాత అదే నమూనాతో తయారైన గ్రంథములన్నీ చేసిన గ్రంథములైనాయి. వ్రాసిన గ్రంథములలోని విషయమే చేసిన గ్రంథములలో ఉండినప్పటికీ మొదట వ్రాసిన గ్రంథము మూల గ్రంథముకాగా, తర్వాత దాని ప్రకారము దానివలె తయారైనవి ఎన్ని అయినా, అవి అన్నియూ దాని నమూనాతో తయారైనవేగానీ మూల గ్రంథములు కానేరవు. తర్వాత వేల సంఖ్యలో తయారైన "జనన మరణ సిద్ధాంతము" అను గ్రంథములకు రచయిత మొదట వ్రాసిన వ్యక్తిగా మా పేరే ఉన్నది. అయినా నేను మొదట ఒక గ్రంథమునే వ్రాశాను. మిగతా అటువంటి గ్రంథములను మొదటి గ్రంథమునకు శ్రమపడి వ్రాసినట్లు వ్రాయలేదు. అప్పుడు 45 రోజులకు ఒక గ్రంథమును మాత్రమే వ్రాయగా, ఇప్పుడు 45 రోజుల్లో 45 వేల గ్రంథాలు తయారైనవి. తర్వాత తయారైన అన్నిటినీ

వ్రాయకున్నా మేము వ్రాసిన నమూనాతోనే తయారైన గ్రంథములగుట వలన వాటికి రచయితగా నాపేరే ఉండడము జరిగినది. దీనినిబట్టి మొదట రచయిత ఒక గ్రంథమును వ్రాస్తే, తర్వాత వ్రాయకుండినా అదే నమూనాతో తయారైన గ్రంథములన్నిటికి అదే పేరు ఉండును. అదే రచయిత ఉండును. మొదట వ్రాసిన పుస్తకమును తర్వాత ఎన్నో పుస్తకములుగా చేయుచున్నాము. దానివలన మొదట పుస్తకమును వ్రాసిన పుస్తకమనగా తరువాత తయారైన పుస్తకములను చేసిన పుస్తకములు అంటున్నాము. మొదట వ్రాసిన దానిలోను, తర్వాత వ్రాసిన దానిలోనూ ఒకే సమాచారముండును, ఒకే రచయిత పేరుండును. అవి ఒకటే అయినా మొదటిది వ్రాసినది తర్వాతది తయారైనది. ఈ విషయమంతయు చెప్పబోవు విషయము అర్థమగుటకు ఉదాహరణగా చెప్పినదే.

ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. ఏ జీవరాసి అయినా లేక ఏ మనిషి అయినా జన్మ ఒకేమారు పొందుతాడు. ఈ విషయమును **"పునర్జన్మ రహస్యము"** అను గ్రంథములోనే చెప్పాము. ప్రతి మనిషి యొక్క జన్మ సృష్ఠి ఆదిలోనే జరిగింది. సృష్ఠ్యాదిలో ఒకమారు జన్మించిన తర్వాత మళ్ళీ ఎవడూ జన్మించడు. కానీ శరీర మార్పిడి కొరకు పునర్జన్మను ప్రతి మనిషి కొన్ని సంవత్సరములకొకమారు పొందుచున్నాడు. దాని ప్రకారము ఇప్పుడు మనము పునర్జన్మ ఎత్తాము అని చెప్పవచ్చును. మనజన్మ సృష్ఠి ఆదిలోనే జరిగినది. సృష్ఠ్యాదిలో నీవు పుట్టినట్లు జ్ఞాపకము లేదు. కావున అసలైన జన్మను మరచిపోయాము. పునర్జన్మకు కనిపించే తల్లి తండ్రులు అవసరము. కానీ జన్మను పొందినపుడు అనగా సృష్ఠ్యాదిలో కనిపించే తల్లి తండ్రులు లేరు. నీవుగానీ ఇపుడు నీకు తల్లి తండ్రులుగా ఉన్నవారుగానీ అందరూ సృష్ఠ్యాదిలో దేవుని చేత సృష్ఠింపబడినారు. సృష్ఠ్యాదిలో ప్రకృతినే

గర్భముగా చేసుకొన్న పరమాత్మ మనిషిని తయారు చేయుటకు తల్లి అండముతో, తండ్రి వీర్యముతో పని లేకుండా పుట్టించాడు. దేవుడు మొదట సృష్టి లేనపుడు తన సృష్టిని రచించాడు. మొదట తన సృష్టి ఎలా ఉండాలో ముందే నిర్ణయించుకొని, అలాగే ఒక రచయిత గ్రంథమును వ్రాసినట్లు దేవుడు తన సృష్టిని రచించాడు (తయారు చేశాడు). మొదటి పుస్తకము తయారగుటకు ప్రింటింగ్ ప్రెస్ అవసరము లేనట్లు, మొదట మానవులను సృష్టించుటకు మానవ సంబంధ అండమూ, కణమూ అవసరములేదు. మొదట వ్రాయబడిన పుస్తకము యొక్క నమూనాను (ప్లేట్‌ను) అనుసరించి ఎన్ని పుస్తకములైనా, ఎన్ని మార్లయినా తయారు చేయవచ్చును. అలాగే దేవుడు స్వయముగా తయారుచేసిన మానవుని నమూనాను అనుసరించి తల్లి, తండ్రి అను సంయుక్త యంత్రముల ద్వారా ఎంతోమంది మానవులను అనేకమార్లు పుట్టించుచున్నాడు. **సృష్ట్యాదిలో ప్రకృతి పురుషుల చేత సృష్టింపబడిన మనిషిది జన్మకాగా, తర్వాత ప్రకృతి పురుషుల స్థానములో స్త్రీ పురుషుడు తల్లి తండ్రిగా ఉండగా క్రొత్త శరీరములతో పుట్టునది పునర్జన్మ అగుచున్నది.** ఇటువంటి పునర్జన్మలు శరీర మార్పిడి కొరకు ఎన్నో జరుగుచున్నవి. పునర్జన్మలు ఎన్ని జరిగినా ఆ సమయములో క్రొత్త శరీరములలో జీవుడు చేరడము జరుగుచున్నది. కానీ జీవుడు మాత్రము సృష్ట్యాదినుండి ఒకేలా ఉన్నాడు. ఒక పేరుగల పుస్తకము ఎన్నిమార్లు క్రొత్తగా తయారైనా దానికి పేరు మారదు, దానిలోని విషయములూ మారవు. కానీ కాగితము మాత్రము మారిపోయివుండును. పాత కాగితముల స్థానములో క్రొత్త కాగితములుండును. అలాగే మనిషి ఎన్నిమార్లు పుట్టినా, ఆ మనిషి శరీరము క్రొత్తదగును. కానీ మనిషిలోని జీవుడు సృష్ట్యాదినుండి ఉండేవాడే ఉండును. వానికున్న గుణములే

ఉండును. పుస్తకము ఎన్నిమార్లు క్రొత్తగా అచ్చువేయబడినా, దాని రచయిత మొదట వ్రాసినవాడే అయినట్లు, మనిషి ఎన్నిమార్లు పునర్జన్మ ఎత్తినా, మొదట సృష్ఠించినవాడే వానికి సృష్ఠికర్త అగును. పుస్తకము పుట్టి ఎంతకాలమైనా దాని రచయిత మారనట్లు మనిషి ఎన్నిమార్లు శరీరము మారి పుట్టినా, సృష్ఠి జరిగి ఎంతకాలమైనా, అతనిని మొదట పుట్టించిన తండ్రి మాత్రము మారడు. అందువలన సృష్ఠ్యాదిలో నిన్ను పుట్టించిన వానినే నిజమైన తండ్రిగా చెప్పవలసి వచ్చినది.

ప్రస్తుత కాలములో తల్లి, తండ్రి కనిపించినా వీరు జిరాక్స్ మిషన్ (అచ్చుయంత్రము) లాంటి వారేననీ, సృష్ఠికర్తలు కారనీ తెలియవలెను. ఒక పుస్తకము పాతదైనపుడు జిరాక్స్ మిషన్‌లో జిరాక్స్ చేయిస్తే ఆ మిషన్ దానిని సృష్ఠించలేదు కదా! ఉన్న పుస్తకములోని విషయమునే లేక వ్రాతనే క్రొత్త పేపరు మీద ముద్రించి పంపినది కదా! అలాగే ఒక శరీరము పాతదైనపుడు తల్లి, తండ్రియను యంత్రములాంటి వారిచేత తిరిగి పుడితే గతములోని జీవుడే క్రొత్త శరీరముతో పుట్టుచున్నాడు తప్ప, ప్రస్తుత కనిపించు తల్లి తండ్రులు మాత్రము అతనిని సృష్ఠించలేదు. పుస్తకమును జిరాక్స్ చేసినపుడు రచయిత పేరు స్థానములో జిరాక్స్ మిషన్ పేరును చెప్పకుండా మొదట రచించిన వాని పేరే చెప్పినట్లు, మనిషి కనిపించు తల్లి తండ్రులకు పుట్టినా అది జన్మకాదు పునర్జన్మే. కావున మొదట జన్మనిచ్చిన దేవుని పేరే తండ్రిస్థానములో చెప్పవలసి వచ్చినది. ఈ విధముగా సృష్ఠ్యాదిలో అందరికి జన్మనిచ్చిన బీజదాత అయిన దేవుడే తండ్రియగును. అందువలన బైబిలులో మత్తయి సువార్త 23వ అధ్యాయములో 9వ వాక్యమునందు **"తండ్రి అని పేరుపెట్టి ఎవరినీ పిలువవద్దు. ఒక్కడే మీ తండ్రి. ఆయన పరలోక మందున్నాడు."** అని చెప్పడము పూర్తి సత్యమైనమాట. అలాగే భగవద్గీత

గుణత్రయ విభాగయోగము అను అధ్యాయములో 3,4 శ్లోకములలో సర్వ జీవులకు బీజదాతనైన నేను తండ్రిని అని చెప్పడము కూడా పూర్తి సత్యమైనది. తండ్రి పరమాత్మ, తల్లి ప్రకృతి అని తెలిసిపోయినది. సృష్ట్యాదిలో పుట్టించిన ప్రకృతి పరమాత్మే నిజమైన తల్లి తండ్రులు. తర్వాత పునర్జన్మలో కనిపించు తల్లి తండ్రులు ఆ జన్మకు తల్లితండ్రులైనా వారు అచ్చు యంత్రములాంటి వారేగానీ నిజమైన సృష్ఠి వారివలన జరుగలేదు. అందువలన బైబిలులో తండ్రి అని పేరు పెట్టి ఎవరినీ పిలువవద్దని చెప్పడము అతిశయోక్తి కాదు.

మనిషికి జన్మ ఒక్కమారే, అయితే పునర్జన్మలు ఎన్నో చెప్పలేము. మనిషికి తండ్రి ఒక్కడే, అయితే తండ్రిలాంటి వారు ఎందరో చెప్పలేము. సృష్ఠి ఆదిలో జన్మించిన మనిషి సృష్ఠి అంత్యము వరకు ఉండవలసిందే, మధ్యలో వచ్చునవి శరీర మరణములేగానీ జీవుని నాశనములు కావు. జీవుని నాశనము మోక్షముతో వచ్చును. జీవుడు మోక్షము పొందనంత వరకు జన్మలు కానటువంటి పునర్జన్మలు పొందవలసిందే. అట్లే తల్లి తండ్రులు కానటువంటి తల్లి తండ్రులలాంటి వారిని చూడవలసిందే. మనిషి పుట్టి ఎన్ని లక్షల, ఎన్ని కోట్ల సంవత్సరములైనదో చెప్పలేము. కానీ ఇంతవరకు మనిషికి తన తల్లితండ్రులెవరో తెలియదంటే సిగ్గుచేటు కాదా! తనకు నిజమైన తల్లితండ్రులు ఉన్నారను విషయము కూడా తెలియదంటే ఆశ్చర్యము కాదా! బయటి ప్రపంచములో ఎంతో మేధావిగా, ఎంతో హెూదాగా, ఎంతో విజ్ఞానిగా, ఎంతో బలవంతునిగా ప్రవర్తించు మనిషికి తన స్వంత తల్లి తండ్రుల మీద ధ్యాసే లేదంటే, అతడు చచ్చినా ఒక్కటే బ్రతికినా ఒక్కటేనని వేమనయోగి **"తల్లి తండ్రుల మీద దయలేని పుత్రుడు పుట్టనేమి గిట్టనేమి, పుట్టలోని చెదలు పుట్టదా గిట్టదా"** అని అన్నాడు. వేమన చెప్పినట్లు ప్రకృతి పురుషులు ఉన్నారనీ, వారు తన తల్లి తండ్రులనీ

తెలియని వారు  పుట్టలోని చెదలతో సమానము.  అవి పుట్టినా గిట్టినా వాటిని గురించి ఎవడూ అనుకోడు.  అటువంటివాడు పుట్టినా ఒక్కటే, పుట్టకున్నా ఒక్కటేనని వేమన భావము.

సృష్ట్యాదిలో పరమాత్మ తన ప్రకృతి చేత శరీరమును తయారు చేయించి, ఐదు ధాతువులతో కూడిన శరీరములో తన అంశ అయిన జీవాత్మను చేర్చి, సజీవ శరీరములను తయారు చేశాడు.  అలా మొదట తయారు చేయబడిన జీవరాసులవి జన్మలని తెలుసుకొన్నాము.  అప్పుడు ప్రారంభమైన జన్మ ఇప్పటి వరకూ ఉన్నది.  తర్వాత కూడా ఉంటుంది. మనిషి సృష్ట్యాదిలో జన్మ తీసుకొన్నపుడు సమాదినుండి లేపబడలేదు. పునర్జన్మలలో మాత్రమే సమాధి అను శరీరమునుండి లేపబడుచున్నాడు. పునర్జన్మలో  తల్లిగర్భమునుండి బయటపడిన శరీరములోనికి, గత జన్మలోని శరీరమునుండి బయటపడిన జీవుడు చేరినపుడు సమాధి అగుచున్నది. సృష్ట్యాదిలో తల్లి గర్భమునుండి శరీరము బయటపడడములేదు.  జీవుడు వేరుశరీరమునుండి రావడమూ లేదు.  అందువలన సృష్టి మొదటిలో జన్మించినపుడు ఎవరికీ సమాధిలేదు.  **సమాధి అనునది పునర్జన్మలు గల వారికి మాత్రమే ఉన్నదని తెలియవలెను.**  పునర్జన్మలో మాత్రమే మనిషి (జీవుడు) సమాధినుండి లేపబడుతాడు అని మూల గ్రంథములలో ఉన్నమాట వాస్తవమవుతున్నది.  మూల గ్రంథములలో దేవుడు సమాధినుండి లేపునని వ్రాయబడివున్నది.  ఇక్కడ ఈ మాటలో మనిషికి కొంత సందిగ్దత ఏర్పడ వచ్చును.  అది ప్రశ్నరూపము కావచ్చును.  దేవుడు రూప, నామ, క్రియలు లేనివాడని మీరే చెప్పారు కదా!  అటువంటపుడు దేవుడు మనిషిని సమాధి నుండి లేపే పని చేయునా అని ప్రశ్నించవచ్చును.  దానికి జవాబు ఏమనగా! దేవుడు సృష్టి పూర్వము పనిచేసి మానవున్ని పుట్టించివుండవచ్చును.  కానీ

సృష్ఠి తర్వాత ఆయనకు పనిలేదు, రూపములేదు, పేరూలేదు. అయితే ఆయన ఏర్పరచిన విధానమును అనుసరించి, ఆయన నియమించిన వారు, ఆయన పనిని చేయడము వలన, ఆ పనిని ఆయన చేసినట్లు చెప్పుచున్నారు. కానీ ఆయన నియమించిన భూతములు, మహాభూతములు, గ్రహములు, ఉపగ్రహములు అను ఎన్నో ఆయన పనిని నెరవేర్చుచున్నవి. దేవుడు ఏ పనినీ స్వయముగా చేయలేదు.

పునర్జన్మలో క్రొత్తగా పుట్టిన శిశుశరీరము వరకు జీవున్ని తీసుకువచ్చి అందులో చేర్చి, తిరిగి దానినుండి లేపడము దేవుని పని అని చెప్పబడినా, ఆ పని జరుగుటకు మూలకారకుడు దేవుడే అయినా, ఆ పనిని మొత్తము దేవుడు చేయడము లేదు. ఆ పనిని చేయుటకు మరియు జీవున్ని జీవితాంతము నడిపించుటకూ, కర్మలను అనుభవింపజేయుటకు తగినట్లు శరీరములో తన పనిగా చేయునట్లు దేవుడు, ఆత్మ అను దానిని తన అంశతో ఏర్పరచి పెట్టాడు. పరమాత్మ (దేవుడు) ఏర్పరచిన ఆత్మ తన పాత్రను సృష్ఠి ఆదినుండి జీవునితోపాటు శరీరములో ఉండి నెరవేర్చుచున్నది. ఈ ఆత్మను ఎవరైతే తెలియగలుగుతారో, తర్వాత వారు పరమాత్మను సులభముగా తెలియుటకు వీలుగును. సృష్ఠ్యాదిలోనే తన పరిపాలన కొరకు దేవుడు ఎందరినో తన సేవకులను ఏర్పరచినా వారు ఎవరో మనకు తెలియదు. దేవుడు ఏర్పరచిన పనులు చేయుటకు, ప్రకృతి సంబంధమైన భూతములను గ్రహములను దేవుడు మనిషితోపాటు సృష్ఠించినా, అన్నిటికంటే గొప్పది అత్యంత శక్తివంతమైన ఆత్మను కూడా మనిషితోపాటే సృష్ఠ్యాదిలోనే దేవుడు సృష్ఠించాడు. శరీరమునకు అధిపతిగా ఆత్మను నియమించి జీవున్ని కర్మ అనుభవించునట్లు చేశాడు. **సృష్ఠిలో ఆత్మపాత్ర చాలా గొప్పది. పరమాత్మ తర్వాత ఆత్మే గొప్పదని చెప్పవచ్చును.** దేవుడు ప్రకృతిని తనకు తోడుగా

సృష్ఠించిన తర్వాత ప్రకృతిని ఐదు భాగములు చేశాడు. అలాగే పరమాత్మ అయిన తనను మూడు భాగములుగా విభజించాడు. ప్రకృతి ప్రకృతిగానే ఉంటూ దానినుండి ఐదు భాగములను బయటికి వచ్చునట్లు చేశాడు. అలాగే పరమాత్మ పరమాత్మగానే ఉంటూ తననుండి రెండు భాగములను బయటికి వచ్చునట్లు చేశాడు. ప్రకృతి నుండి వచ్చిన ఐదు భాగములు శరీరము కాగా, పరమాత్మనుండి బయటికి వచ్చిన ఆత్మ, జీవాత్మ అను రెండూ శరీరములో చేరిపోయినవి. దీనినిబట్టి ఒక సజీవ శరీరములో ప్రకృతి యొక్క ఐదు భాగములు మరియు పరమాత్మయొక్క రెండు భాగములు ఉన్నవని తెలియుచున్నది.

ఇది శాస్త్రబద్ధమైన విషయము. అందువలన ఈ విషయములు పూర్తి సత్యమైనవి. ఈ మాటను మేము చెప్పినా మా విలువ తెలియని వారు నమ్మకపోవచ్చును. శాస్త్రబద్ధమైనపుడు బయటికి నిరూపణకు రావలెను కదా! అని అడుగవచ్చును. ఇటువంటి ప్రశ్న కొందరికి రావచ్చునని పరమాత్మ ముందే ఈ జ్ఞానము నిరూపణగా తెలియునట్లు మన శరీరము మీద ఒక రకమైన గుర్తునుంచాడు. శరీరము మీద సృష్ట్యాదిలోనే దేవుడు పెట్టిన గుర్తు ప్రపంచ విధానములో ఏ అర్థము లేనిదైనా, పరమాత్మ విధానములో విశేషమైన అర్థముకలదిగా ఉన్నది. ఆ గుర్తు యొక్క వివరమును తెలుసుకొనే ముందు కొంత సమాచారమును తెలుసు కొందాము. సృష్ఠి మొదటిలోనే ప్రకృతి సంబంధమైన శరీరములో పరమాత్మ సంబంధమైన జీవాత్మ ఆత్మలను దేవుడు అమర్చడము జరిగినది. సృష్ఠికంటే ముందు కేవలము పరమాత్మ (దేవుడు) మాత్రము ఉండేవాడు. నేడు కనిపించు ప్రకృతిగానీ, కనిపించని జీవాత్మ, ఆత్మలుగానీ ఏవీ లేవు. ప్రకృతిలోనున్న ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి ఏవీ లేవు. ఆకాశము

అనగా శూన్యము కూడాలేని స్థితి ఎట్లుంటుందో ఏ విధముగా ఊహించు కొనుటకు కూడా సాధ్యపడదు. ఆ స్థితి దేవునికి తప్ప ఎవరికీ తెలియదు. అటువంటి స్థితినుండి అచర ప్రకృతి తయారైనది. తర్వాత చర ప్రకృతి తయారైనది. వెంటనే జీవాత్మ ఆత్మలు తయారైనవి. సృష్ట్యాదిలో రెండు ప్రకృతులు, రెండు ఆత్మలు తయారగుటకు క్షణకాలమే పట్టింది. ఒకే క్షణంలో దైవసంకల్పము చేత ప్రకృతీ, ప్రకృతి సంబంధమైన శరీరములు తయారు కాగా, అప్పుడే పరమాత్మ సంబంధమైన ఆత్మ జీవాత్మలు తయారైనవి.

మొదట ప్రకృతి సంబంధమైనవి తయారుకాగా ఆ క్షణమే పరమాత్మ సంబంధమైనవి తయారైనవనీ, ఇది సృష్ట్యాదిలోనే జరిగిన పని అని తెలియుటకు, అప్పుడే మొదట పుట్టిన శరీరము మీద ప్రకృతి, పరమాత్మ సంబంధమైన అర్థమునిచ్చు గుర్తును దేవుడు ముద్రించాడు. ప్రపంచములో ఏ అర్థమూనివ్వని ఆ ముద్రలు, దైవజ్ఞానములో ఎంతో అర్థమునిచ్చునవై ఉండినప్పటికీ వాటిని గురించి ఎవరూ యోచించనూ లేదు. అవి ఎవరికీ తెలియబడనూలేదు. ప్రపంచములో ఇంతవరకు ఎవరికీ తెలియని ఆ ముద్రలు ప్రతి శరీరము మీద కుడి ఎడమ ప్రక్కల ఒక్కొక్క భాగమున ఒక్కొక్కటి అందరికి కనిపించునట్లు ఉన్నవి. ఆ గుర్తులు అమెరికాలో తెల్లగ పుట్టిన వానికిగానీ, ఆఫ్రికాలో నల్లగ పుట్టిన వానికిగానీ ఎక్కడ పుట్టినా అందరి శరీరముల మీద ముద్రించినట్లు ఉన్నవి. బాగా కాగపెట్టిన ఇనుప ముక్కతో కాల్చితే చర్మము ఎలా మాడిపోయి సాధారణ చర్మముకంటే వేరుగా తయారైపోవునో అలాగే చర్మము మీద కాలినట్లుండుట వలన దానిని దేవుడు ముద్రించిన ముద్ర అంటున్నాము. ఈ ముద్ర విషయము ఇంతవరకు ఎవరూ చెప్పలేదు, కావున మేము మీకు చెప్పి, అప్పుడు ప్రవక్తలు వదలివేసిన వాటిలో ఒకదానిని ఈ గ్రంథములో పూరించుచున్నాము. దేవుని సమస్త

జ్ఞానములలో ఇది సరిక్రొత్త జ్ఞానముగా గుర్తించవలెను. ప్రకృతి ప్రకృతిగానే ఉంటూ చరాచర అను రెండు భాగములుగా చీలిపోయినదని చెప్పుకొన్నాము కదా! ప్రకృతి రెండు భాగములుగా ఉండుట వలన ప్రకృతితో తయారైన శరీరము ప్రత్యక్షముగా కుడి ఎడమ అను రెండు భాగములుగా తయారైనది. కుడి ఎడమ భాగములుగా శరీరము తయారై, ప్రకృతి రెండు భాగములుగా ఉన్నదని తెలియునట్లు చేసినది. ప్రకృతి రెండు భాగములుగా ఉండుట వలన ప్రకృతి వలన తయారైన గుణములు కూడా మంచి చెడు గుణములు అను రెండు భాగములుగా తయారైనవి. గుణములు రెండు భాగములు కాగా వాటి వలన వచ్చు కర్మలు పాప, పుణ్య అను రెండు రక కర్మలుగా తయారైనవి. కర్మలు రెండు రకములు కాగా, వాటిని బట్టి మనిషి (జీవాత్మ) అనుభవములు కూడా సుఖ దుఃఖ అను రెండు భాగములుగా చీలిపోయినవి. ఈ విధముగా స్థూలశరీరము, కుడి ఎడమ అను రెండు భాగములు కనిపించునట్లున్నది. ఈ విధముగా కుడి ఎడమగా కనిపించు శరీరము మీద విశాలముగా ఖాళీగానున్న వక్షస్థలము మీద దేవుడు కాల్చిపెట్టిన ముద్రలవలె రెండు ముద్రలను ఉంచాడు. వాటినే **ఎదమీద ముద్ర** అంటున్నాము.

ఈ ఎదమీద ముద్ర దేవుడు పెట్టినది. కావున అందరి శరీరముల మీద ఉన్నది. నేడు నేను ఫలానా మతము వాడిననీ, ఫలానా దేశము వాడిననీ, ఫలానా కులము వాడిననీ చెప్పుకొను వారందరికీ ఒకే రకముగా ముద్ర అందరి శరీరముల మీద ఉన్నది. ఎదమీద ముద్ర ఆకారమును తర్వాత పేజీ పటములో చూడవచ్చును. చర్మము కాలినచోట వెంట్రుకలు మొలచనట్లు



**ఎదమీద ముద్ర**

ఎదమీద ఉన్న ముద్రలో చర్మము కాలినట్లుండి, ఆ చర్మము మీద వెంట్రుకలు కూడా మొలచకుండా ఉండును. అలాంటి గుండ్రని చర్మము ప్రత్యేకముగా కనిపిస్తూ చర్మమునకు వేరుగా కనిపించుచుండును. అట్లు వేరుగా కనిపించు గుండ్రని చర్మము మీద మధ్య భాగములో కందిగింజ పరిమాణముతో ఎత్తుగా ఒక గుర్తు కనిపించుచుండును. ఎదురుగా చూచేవారికి పాణి మట్టములో శివలింగమును పైనుండి చూచినట్లు కనిపించును. కాలినట్లు గుండ్రముగా అర్థ అంగుళమునకు పైగానున్న ఆకారము ప్రకృతికి గుర్తుకాగా, ఆ ఆకారములో మధ్యన ఎత్తుగా కందిగింజంత వున్న ఆకారము పరమాత్మ గుర్తుగా ఉన్నది. ప్రకృతి, పరమాత్మ గుర్తుండునట్లు, ప్రకృతి పరమాత్మల వలననే నీవు పుట్టావు, నీ శరీరము పుట్టినదని తెలియునట్లు, ఈ గుర్తులో నున్న రెండు చిహ్నములు నీకు తల్లి తండ్రి గుర్తులుగా లెక్కించబడుచున్నవి. ప్రతి మనిషి తల్లి అయిన ప్రకృతి వలన, తండ్రి అయిన పరమాత్మ వలననే పుట్టాడను అర్థమును ఎదమీద ముద్రలు గుర్తు చేయుచున్నవి. ప్రకృతి భాగముగా గుర్తించుచున్న అర అంగుళము వెడల్పు వృత్తాకారము మధ్యలో ఎత్తుగా ఒక ఆకారము ఉండుట వలన ప్రకృతికి ఇరుసులాగ, అధ్యక్షునిగా పరమాత్మ ఉన్నాడని తెలియుచున్నది. ఈ విధముగా ఎదమీద దేవుడుంచిన ముద్ర ఎంతో ఆధ్యాత్మిక అర్థము నిచ్చునదై ఉండినా, దానిని గురించి ఏ

ఆధ్యాత్మికవేత్తా పట్టించుకోలేదు. ఇప్పుడిది మనము చెప్పుకోవడము వలన దేవునికి ఉన్న సమస్త జ్ఞానములలో ఒక జ్ఞానమును మనము తెలుసు కొన్నట్లయినది. ఈ ముద్రను గురించి ప్రతి ముస్లీమ్, ప్రతి క్రైస్తవుడూ, ప్రతి హిందువూ (ఇందువూ) యోచించమని తెలియజేయుచున్నాము.

దేవుడు ప్రపంచమునూ, దానిలోని జీవరాసులనూ సృష్ఠించి జీవరాసులు బ్రతుకుటకు విధి విధానమును కూడా కల్పించాడు. సృష్ఠి ప్రారంభములోనే జీవులను, వాటికి కర్మను సృష్ఠించిన దేవుడు, ఆ కర్మనుండి బయటపడి దేవున్ని చేరుకొనే మార్గమును కూడా తెలియజేశాడు. తనను (దేవున్ని) చేరుకొనే మార్గమునే జ్ఞానమార్గము అంటున్నాము. దేవునికి సంబంధించిన ధర్మములను తెలుసుకోవడమే జ్ఞానమగును. మనిషిని తయారు చేసి, అతను ప్రపంచములో ఏమి చేయాలనుటకు తగిన కర్మను నిర్మించినపుడు దానికి అనుబంధముగానున్నవన్నీ తయారైనవి. కర్మ రెండు రకములుకాగా, దానితో గుణములు కూడా రెండు రకములు ఏర్పడినవి. గుణములు రెండు భాగములుకాగా వాటికి సంబంధించిన ఆచరణలు రెండు రకములుగా ఏర్పడినవి. అట్లే అనుభవములు కూడా రెండు రకములు ఏర్పడినవి. వీటిలో గుణములు ఏవైతే మనిషి శరీరములో ఉన్నవో అవి ప్రకృతి జనితములు. శరీరము ప్రకృతి వలన పుట్టినట్లే గుణములు కూడా ప్రకృతి వలన పుట్టినవే. ప్రకృతి వలన పుట్టిన శరీరములో ముఖ్యపాత్రను గుణములే పోషించుచున్నవి. గుణములు కార్యాచరణకు సూత్రములైనా గుణములన్నియు కలిసి మాయ అను ఒక ప్రత్యేకశక్తిగా శరీరములో తయారు చేయబడినది. దేవునిచేత తయారు చేయబడిన మాయ అను శక్తికి దేవుడు ప్రత్యేకమైన బాధ్యతను అప్పచెప్పాడు. ఆ బాధ్యత ఏమనగా! దేవుడు మనిషిని కర్మనుండి బయటపడుటకు తన ధర్మములను జ్ఞానరూపముగా చెప్పాడు

కదా! మనిషిని తన ధర్మములవైపు రాకుండ చేయడమే మాయకు అప్పచెప్పిన పని. తనకు నచ్చిన వానిని మాత్రము ఆటంకపరచకుండా వదలివేసి, తనకు నచ్చని వానిని తనవైపు రాకుండ చేయవలెనని మాయను దేవుడు ఆజ్ఞాపించాడు. ఈ విషయము ఎవరికీ తెలియదు. దేవుడు మాయకు అప్పచెప్పిన బాధ్యత అత్యంత గోప్యమైనది. అందువలన అది రహస్యముగానే ఎవరికీ తెలియకుండా ఉండిపోయినది. అన్ని మతములలోను మాయ వేరు వేరు పేర్లతో పిలువబడుచున్నది. హిందూ (ఇందూ) మతములో **మాయ** అని పిలువబడగా, ఇస్లామ్‌లో సైతాన్ అనియు, క్రైస్తవములో సాతాన్ అను పేరుతో పిలువబడుచున్నది. మాయ అనునది దేవుని జ్ఞానమునకు వ్యతిరేఖమైనదనీ, దైవమార్గములో ఆటంకములను కలుగజేయుననీ అందరికి తెలుసు.

మాయ అనునది దైవమునకు వ్యతిరేఖమైనదనీ, అది ఎంతో బలమైనదనీ, దాని ముందర ఎంతటి వాడైనా జ్ఞానమార్గమును వదలి అజ్ఞాన మార్గమున పోవలసిందేననీ, దానిని జయించుట దుస్సాధ్యమనీ కొందరు చెప్పుచుందురు. భగవద్గీతలో కూడా "మమ మాయా దురత్యయా" నా మాయను జయించుట దుస్సాధ్యమని చెప్పబడినది. మాయను జయించుట సాధ్యముకాదని కొందరనుచుండినా, మాయకు అంతబలమెట్లు వచ్చిందని ఎవరూ ఆలోచించలేదు. భగవద్గీతలో దేవుడే స్వయముగా మమ మాయా అని అన్నాడు. **మమ మాయా** అనగా నా మాయ అని అర్థము. ఆయన (దేవుని) మాయ ఆయన మార్గమునకే ఆటంకమును కలుగజేయుచున్నది కదా! దేవుని జ్ఞానమువైపు పోవాలనుకొన్న వారిని అనేక ఇబ్బందుల పాలు చేసి చివరకు ఆ మార్గమును వదలి అజ్ఞాన మార్గములో పోవునట్లు చేయుచున్నది కదా! అలాంటపుడు అది దేవునికి ప్రతి పక్షముగా ఉన్నట్లే

కదా! అటువంటి దానిన దేవుడు నా మాయ అనడమేమిటి? అని ఎవరైనా అడుగవచ్చును. దానికి జవాబు ఏమనగా! దేవుడే మాయను తయారు చేసి, మాయకు ఒక పనిని అప్పజెప్పాడు. అప్పటినుండి ఇప్పటివరకు మాయ దేవుడు చెప్పిన పనిని శ్రద్ధగా, భక్తిగా చేయుచున్నది. **కొన్ని సమయములలో మాత్రము దేవుని మీద భక్తి ఉన్నట్లు నటించి తర్వాత ప్రపంచ విషయముల మీదే శ్రద్ధగలవారు దేవునికి ఇష్టులు కారు. దేవునికి ఇష్టులు కానివారిని గ్రహించి మాయ వారిని అదే పనిగా దేవునికి దూరమవు నట్లు చేయుచున్నది.** ఎవరైతే దేవునికి నచ్చునట్లు భక్తి శ్రద్ధలతో ప్రవర్తిస్తారో, ఎవరైతే అన్యదేవతల మీద ధ్యాసలేకుండా అందరికంటే గొప్పవాడు దేవుడని తెలిసి ప్రవర్తిస్తారో, అటువంటి వారికి మాయ ఎటువంటి ఆటంకమూ కలుగజేయదు. కొద్దిసేపు దేవుడు గొప్పవాడనీ, దైవజ్ఞానము గొప్పదనీ పొగడి తర్వాత ఎవరికీ తెలియకుండా ఇతర దేవతలను కూడ ఆరాధించు వారిని మాయ దేవునికి ఏదో ఒక విధముగా దూరముచేయును.

మనిషి పైకి ఎట్లు కనిపించినా, నిజమైన దైవజ్ఞానిగా నటించినా, అంతరంగమందు వానిలో ఏమున్నదో గ్రహించు మాయ, దేవుని మీద శ్రద్ధలేని వానిని ఏరివేసినట్లు, దేవుని జ్ఞానమునకు వానిని దూరముగా పోవునట్లు చేయుచున్నది. ఇదే విషయమునే వేమనయోగి కూడా తన పద్యములో ఇలా అన్నాడు.

*పతియొప్పిన సతి యొప్పును*
*పతి సతులొకటైన పరమ పావనమందున్*
*పతి సతి న్యాయమే మోక్షం*
*బతులిత పరమాత్మ నైక్యమగురా వేమా.*

**భావము :-** పతి అనగ భర్త, సతి అనగ భార్య అని అందరికీ తెలుసు.

పెళ్ళి అయితేనే పతి సతులౌతారను విషయము కూడా తెలుసు. పతి, సతులకు పిల్లలు పుడుతారని కూడా తెలుసు. ఈ విధానమంతా జ్ఞానులకు, అజ్ఞానులకు అందరికీ తెలిసినప్పటికీ చాలామందికి ఈ విషయము దైవిక మైనదని, ఆ దైవిక విషయమే ప్రపంచములో ఇలా ప్రతిబింబించి ఉన్నదనీ, ప్రపంచములో ప్రత్యక్షముగనున్న పతి, సతుల విధానమును ఆధారము చేసుకొని పరోక్షముగనున్న దైవ విధానమును అర్థము చేసుకోగలరని దేవుడే ఇలా ఉంచాడు. దైవికమైన పతి, సతి విధానమేదో ఇపుడు వివరించి చూచుకొందాము.

భగవద్గీత గుణత్రయ విభాగయోగమను అధ్యాయములో మొదటనే పరమాత్మను పతిగ, ప్రకృతిని సతిగ చెప్పారు. శ్రీకృష్ణుడు చెప్పిన భగవద్గీత ప్రకారము జగతి మొత్తమునకు ప్రకృతి, పురుషులు సతి పతులుగ ఉంటూ ప్రతి జీవరాసికి వారే తల్లితండ్రులైనారు. ప్రపంచములోని మనుష జాతికే కాక క్రిమి, కీటక, పశు, పక్షి, వృక్షలతాదులకన్నిటికీ తల్లి ప్రకృతి, తండ్రి పరమాత్మ అని తెలుపబడి ఉన్నది. జగతి మొత్తమునకు తల్లి తండ్రులుగ ఉంటూ, పతి సతులుగ యొప్పు పరమాత్మ ప్రకృతి ప్రపంచములో విభిన్నముగ ప్రవర్తించుచున్నారు. పతియైన పరమాత్మకు సతియైన ప్రకృతి విధేయురాలై నప్పటికి, పరమాత్మ ఆదేశానుసారము జగతిపట్ల పరమాత్మ మార్గమైన దైవమార్గమునకు ప్రకృతియైన మాయ ఎంతో వ్యతిరేఖముగనున్నది. దైవమార్గమును అనుసరించవలెననుకొను వానిని ఆ ప్రయత్నమును భంగముచేసి విరమించుకొనునట్లు చేయుచున్నది. అంతయు దేవునికి తెలిసే జరుగుచున్నది. దేవుని గూర్చిన ప్రయత్నములో మాయ ప్రభావమునకు తట్టుకొనలేక అందరూ వెనుదిరుగుచున్నారు. అయినప్పటికి ఎన్నో లక్షల మందిలో ఏ ఒక్కడో మాయను వ్యతిరేకించి అన్ని కష్టములకు ఓర్చుకొని

దేవుని చేరుకోవాలని ప్రయత్నించుచున్నారు. అటువంటి వానిని దేవుడు, వాని మార్గమును సుగమము చేసి మాయ ఆటంకమును తొలగించి, తనయందు కలుపుకొనును. బలమైన మాయ కల్పించు పరిస్థితులన్నిటినీ అనుభవిస్తూ, పట్టువదలక దేవునికొరకు ప్రయత్నించు వానిని దేవుడు ఒప్పుకొనును. దేవుడు ఒప్పుకొన్నపుడు మాయ వానిని ఆటంకపరచదు అటువంటి వాని యోగము యొక్క క్షేమమును దేవుడే పరిక్షించును. అపుడు వాడు దేవునియందైక్యమై పోవును.

ప్రపంచములో మాయ కలుగజేయు అనేక కష్టములను అతిక్రమించి దేవుని మార్గమును వదలని వానిని, దేవుడు తన మనిషిగ అంగీకరించును. అపుడు వెంటనే ప్రకృతియైన మాయ తాను కూడ వానిని ఒప్పుకొన్నదై వానికి ఆటంకము కలుగజేయదు. కావున పై పద్యమందు పతియొప్పిన సతి యొప్పునన్నారు. ఆ విధముగ పరమాత్మ, ప్రకృతి ఇద్దరూ వానిపట్ల ఒకటై నడుచుకొన్నపుడు వాడు మోక్షము పొందును. దానినే పద్యమందు వ్యక్తపరుస్తూ పతిసతులొకటైన పరమ పావనమందున్ అన్నారు. పతి, సతి ఇద్దరూ ఒక మార్గమును నడుచుకోవడము న్యాయమగును. పతికి సతి విరుద్ధముగ నడుచుకోవడము అన్యాయమగును. ప్రకృతి, పరమాత్మ భక్తుని పట్ల న్యాయమార్గమును చరించిన మోక్షము లభించును. కావున పై పద్యమందు పతి సతి న్యాయమే మోక్షము అన్నారు. పతి, సతి న్యాయముగ చరించినపుడు భక్తుడు వెంటనే జన్మరాహిత్యము పొందును. కనుక బతులిత పరమాత్మ నైక్యమగురా అన్నారు.

ప్రపంచములో ఒక భక్తునిపట్ల భార్యాభర్తలైన ప్రకృతి, పరమాత్మలు మొదట అన్యాయముగ ప్రవర్తించుదురని ఈ పద్యము ద్వార వేమన మనకు తెలియజేశాడు. పతి ఒప్పినపుడే సతియు ఒప్పుకొని ఇద్దరూ

న్యాయముగ ప్రవర్తించుదురు. వారిద్దరు ఒకటై న్యాయముగ ప్రవర్తించినపుడే భక్తునికి మోక్షము లభించును. మాయ ఆటంకములను ఓర్చుకోలేక నేనెంత భక్తిగ ఉన్నా, నాకే కష్టాలొస్తున్నవనీ, దేవునివద్ద న్యాయమే లేదనుకొన్నవాడు దేవుని మార్గములో భ్రష్టుడగును. దేవుని గూర్చి ఏమీ అనుకోక అన్నిటికి ఓర్చు కొన్నవాడు, మొదట పరమాత్మ చేత ఒప్పుదల పొంది ప్రకృతి, పరమాత్మలు న్యాయముగ ప్రవర్తించగ వాడు మోక్షము పొందును.

పతి సతుల విధానము ప్రపంచములో ప్రతిబింబించి ఉన్నదని ముందే చెప్పుకొన్నాము. పతికి సతి వ్యతిరిక్తముగ నడుచుకొనుట, పతిని తన మాటవినునట్లు చేసుకొనుటైన అన్యాయ విధానము భూమిమీద కలదు. అట్లే పతికి, సతి అనుకూలముగ నడుచుకొనుట, పతి మాటయే తన మాటగ పతి చెప్పినట్లు సతి నడుచుకొను న్యాయమార్గమూ భూమిమీద గలదు. మీ అనుభవములో న్యాయ అన్యాయ, పతిసతులను గూర్చి తెలిసినట్లయితే ఎవరైన సంపూర్ణ జ్ఞానులు కాగలరు. దేవుని మార్గములో నడుచు వారికి ఆటంకములేర్పడిన, దేవుని దగ్గర న్యాయముందా? అని సహనము కోల్పోయి మాట్లాడరు. ఎన్ని కష్టములొచ్చిన ఇది తల్లియైన మాయ పని అని ఎరుకగల్గి నడుచుకొందురు.

పైన వేమనయోగి చెప్పినట్లు, భగవద్గీతయందు విజ్ఞానయోగమను అధ్యాయములో 14వ శ్లోకమున ఇలా ఉన్నది.

*దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।*
*మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే ॥*

**భావము :–** దేవుడైన నేను సృష్టించిన గుణములతో కూడుకొన్న నా మాయ దుస్సాధ్యమైనది. ఎవడైతే నన్నే ఆరాధిస్తాడో అట్టివాడు నా మాయను సులభముగా దాటిపోగలడు.

చూచారా! భగవద్గీతలో దేవుని వాక్యము! దేవుడే తన మాయను దుస్సాధ్యమైనదనీ, దానిని దాటి ఎవరూ పోలేరని చెప్పాడు. అలాంటపుడు మాయ ఎంత బలమైనదో చెప్పనవసరములేదు. నేను జ్ఞానిని, యోగిని, స్వామిని, విశ్వాసిని అని ఎవరైనా అనుకొన్నంత మాత్రమున అతనిని మాయ పరీక్షించనిదే వదలిపెట్టదు. మాయ శోధనలో అతడు దేవునికి ఇష్టమైన వాడైతే వానిని దేవుని మార్గములో ఆటంకపరచదు. ఒకవేళ పైకి జ్ఞానిగా కనిపించినా, లోపల దేవున్ని పూర్తిగా విశ్వసించని వానిని మాత్రము మాయ వదలిపెట్టక, ఆ మార్గములో అందరికీ తెలియునట్లు భ్రష్టున్ని చేయును. ఇదే విషయమునే "మూడు కాల్వలు దాటలేరన్నా" అని పోతులూరి వీరబ్రహ్మముగారు కూడా చెప్పడము జరిగినది. మూడు కాల్వలు అనగా మూడు గుణములని అర్థము. సాత్త్వికి, రాజస, తామస గుణ భాగములను మూడు కాల్వలన్నారు. మూడు గుణములనే కలిపి మాయ అనుట జరుగుచున్నది. దీనినిబట్టి మన శరీరములో మాయ తలలోనే తిష్టవేసుకొని ఉన్నదనీ, దానికి తెలియనిది ఏదీ జరగదనీ, ఏది జరిగినా గుణముల వలననే జరుగుట వలన మాయను అతిక్రమించి ఎవడూ పోలేడని చెప్ప వచ్చును. అంత బలమైన మాయను ఎవడు జయించగలడు అంటే, ఎవడైతే దేవున్ని ఆరాధించి ఆయనకు ఇష్టము గలవాడైతాడో, వాడే గుణ సమ్మేళనమైన మాయను జయించి దాటిపోగలడు. ఇదే విషయమునే గీతలో ''యే మామేవ ప్రపద్యన్తే" ఎవడైతే నన్నే ఆరాధిస్తాడో "మాయా మేతాం తరన్తితే" వాడు మాయను దాటిపోగలడు అని భగవంతుడు అన్నాడు.

దేవున్ని ఆరాధించడము అంటే ఆయన గొప్పతనమంతా తెలిసి వుండాలి. ఆయన గొప్పతనమంతా తెలియాలి అంటే ఆయన ధర్మములన్నీ శాస్త్రబద్ధముగా తెలిసివుండాలి. ఆయన ధర్మములన్నీ తెలియాలి అంటే

ఆయన యొక్క సమస్త సమాచారము (సమస్తజ్ఞానము) తెలిసివుండాలి. అయన యొక్క సమస్త జ్ఞానము తెలియాలంటే దేవుని చేత చెప్పబడిన మూల గ్రంథములలోని జ్ఞానమంతా తెలియాలి. అలా తెలిసినప్పుడే దేవుని విషయములో ఏ ప్రశ్నవచ్చినా దానికి మనిషివద్ద సమాధానముండగలదు. దేవుని విషయమునకు సంబంధించిన ఏ ప్రశ్నకైనా సమాధానమున్నపుడు అతను దేవుని యెడల పూర్తి శాస్త్రబద్ధమైన విశ్వాసికాగలడు. అట్లు కాకపోతే ఏ ఒక్క ప్రశ్నకైనా సరియైన, శాస్త్రబద్ధమైన జవాబు లేకపోతే, ఆ ప్రశ్న ప్రశ్నగానే ఉండిపోవును. జవాబులేని ఆ ప్రశ్నవల్లే దేవుని మార్గములో సంశయము వచ్చుటకు అవకాశము ఏర్పడును. దేవుని మార్గములో ఒక్క ప్రశ్న మిగిలినా దానితో మాయ శోధించి, అనుమానము రేకెత్తించి, ఆ అనుమానమును పెద్ద ఆటంకముగా మార్చి, దేవుని మార్గమునుండి తప్పించును. మనిషి అందరికంటే నేనే సరియైన మార్గములో ఉన్నానని అనుకొనుచుండినా, నా మతమే సరియైనదని అనుకొనుచుండినా, మా మతములోని దేవుడే నిజమైన దేవుడనుకొనుచుండినా ఫరవాలేదు. కానీ దేవునికి సంబంధించిన సమస్త జ్ఞానము తనకు తెలిసిందో లేదో చూచు కోవలెను. దేవునికి సంబంధించిన ఏ ప్రశ్నకైనా తనవద్ద శాస్త్రబద్ధమైన సమాధానము ఉందో లేదో చూచుకోవలెను. దేవునికి సంబంధించిన సమస్త జ్ఞానమూ తెలిసినపుడు, అన్ని ప్రశ్నలకూ శాస్త్రబద్ధమైన జవాబు ఉండును. అట్లు సమస్త జ్ఞానమును తెలిసిన వానిని మాయ ఏమీ చేయలేదు. ఎందుకనగా మాయ పతియైన దేవుడు వానిని ఒప్పియుండును.

ఇప్పుడు ఎవరైనా నన్ను "మీ దృష్టిలో **సమస్త జ్ఞానము** అంటే ఏది" అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! మాకు తెలిసినంతవరకు ఇప్పటికి పరమ భగవద్గీత, పవిత్ర ఖురాన్, పరిశుద్ధ

బైబిలు గ్రంథములలో చెప్పబడినదేకాక, ఇంకొకమారు చెప్పునదంతయు సమస్త జ్ఞానమని చెప్పవచ్చును. అట్లని ఒక భగవద్గీతను చదివి నాకు సమస్త జ్ఞానము తెలిసినదని అంటే సరిపోదు. అట్లే బైబిలును చదివి సమస్త జ్ఞానము తెలిసిందంటే కూడా సరిపోదు. **మూల గ్రంథములైన భగవద్గీత, బైబిలు, ఖురాన్ మూడింటిని చదివిన తర్వాత ఇంకా ఏదైనా మిగిలి ఉంటే దానితో సహా సమస్త జ్ఞానమగును. ఒకవేళ మూడు గ్రంథములలో ఇంకా మిగలకుండా అంతా చెప్పబడివుంటే అదియే సమస్త జ్ఞానమగును.** అయితే ఏ మతము వారు ఆ మత గ్రంథమును గొప్పగా చెప్పుకొందురు. దానిలో సమస్త జ్ఞానముకలదని చెప్పుచుందురు. ఆ మాట నిజమా? అబద్ధమా? అని చెప్పుటకు ఒక అవకాశము గలదు. బైబిలు గ్రంథములో యోహాను సువార్తనందు 16 ఆధ్యాయము 12,13,14 వచనములో **"నేను మీతో చెప్పవలసినవి ఇంకనూ అనేక సంగతులు కలవు. కానీ ఇప్పుడు మీరు వాటిని సహించలేరు. అయితే ఆయన అనగా సత్య స్వరూపియైన ఆత్మ వచ్చినపుడు మిమ్ములను సర్వ సత్యములోనికి నడిపించును. ఆయన తనంతట తాను ఏమీ బోధించక, వేటిని వినునో వాటిని బోధించి సంభవింపబోవు సంగతులను (జ్ఞానమును) మీకు తెలియ జేయును. ఆయన నా వాటిలోనివి తీసుకొని మీకు తెలియజేయును."** ఈ మాటను బట్టి మూల గ్రంథములలో ప్రవక్తలు చెప్పిన జ్ఞానమే కాక ఇంకనూ జ్ఞానము మిగిలివున్నదని చెప్పవచ్చును. ఇంతేకాక అదే బైబిలు, అదే యోహాను సువార్తలో 14వ అధ్యాయము 26వ వాక్యములో "ఆదరణకర్త అనగా తండ్రి నా నామమున పంపబోవు పరిశుద్ధాత్మ **సమస్తమును** మీకు బోధించి మీతో చెప్పిన సంగతులన్నిటిని (జ్ఞానములన్నిటిని) మీకు జ్ఞాపకము చేయును." అని వున్నది. దానినిబట్టి చూస్తే ఆదరణకర్తగా వచ్చు వ్యక్తి

ప్రవక్తలు చెప్పని సమస్త జ్ఞానమును బోధించడమేకాక, చెప్పిన వాటిని కూడా విశదీకరించి అర్థమగునట్లు చేయునని తెలియుచున్నది.

మరికొందరు కృష్ణుడు, ఏసు ప్రవక్తలు చెప్పిపోయిన తర్వాత వచ్చిన ప్రవక్త అయిన హజ్రత్ మహమ్మద్ ప్రవక్తగారు ఖురాన్‌లో సమస్త జ్ఞానము చెప్పియుండవచ్చును కదా అని వారి ఉద్దేశమును వ్యక్తపరచవచ్చును. ఇది సమంజసమైన మాటే! ఆఖరి ప్రవక్త అని చెప్పబడిన మహమ్మద్ ప్రవక్త గారు చెప్పారు అనుటకు వచ్చువాడు ఆదరణకర్త అని చెప్పబడినది. ఆదరణకర్తవేరు, ప్రవక్తవేరు. ప్రవక్త సమస్త ప్రపంచమునకు తెలియబడు వాడు. కానీ ఆదరణకర్త బ్రతికియుండగా ఎవరికీ తెలియబడడు. ఈ విషయమై బైబిలు గ్రంథములో యోహాను సువార్తయందు 14వ అధ్యాయము, 17వ వాక్యము **“లోకము ఆయనను చూడదు, ఆయనను ఎరుగదు కనుక ఆయనను పొందనేరదు. మీరు ఆయనను ఎరుగుదురు, ఆయన మీతో కూడా నివసించును, మీలో ఉండును”** అని ఉన్నది. దీనినిబట్టి ఆదరణకర్తగా వచ్చువాడు ప్రవక్త కాదని తెలిసిపోయినది. ఆదరణకర్తగా వచ్చిన వాడు ప్రపంచములోని ప్రజలకు తెలియడని తెలిసిపోయినది. ప్రవక్త గుర్తింపు పొందినవాడు, ఆదరణకర్త గుర్తింపులేనివాడు. అయితే ప్రభువు వున్న కాలములో ప్రభువు ఎవరితో అయితే ఈ మాటలు ఆ రోజు చెప్పాడో, వారు మాత్రము ఆదరణకర్తను గుర్తించుదురు. వారి మధ్యనే ఆయన జీవించును. ప్రభువు తన పదకొండు మంది శిష్యులకు ఈ మాటను చెప్పాడు. కావున ఆదరణకర్తగా వచ్చువాడు పది, పదకొండుమందికి తప్ప ఎవరికీ తెలియడని అర్థమగుచున్నది. అందువలన ఆదరణకర్త ప్రవక్త కాదని చెప్పవచ్చును. లోకము చేత గుర్తింపబడని, ప్రవక్తకానటువంటి వ్యక్తి చేత ప్రవక్తలు వదలి వేసిన జ్ఞానము కూడా చెప్పబడును మరియు

ప్రవక్తలు చెప్పిన జ్ఞానము కూడా ఆయన విశదీకరించి చెప్పునని తెలియుచున్నది.

మాయను జయించి దేవున్ని చేరుకోవాలంటే, ముందు మూల గ్రంథములైన మూడు మత గ్రంథములను చదవాలి. మూడు మత గ్రంథములలో కొద్ది తేడాలో ఒకే జ్ఞానము, ఒకే దేవున్ని గురించి చెప్పబడి ఉండినప్పటికీ, ఆ గ్రంథములలోని జ్ఞానమే చాలామందికి అర్థముకాక మా జ్ఞానమువేరు, మా దేవుడు వేరు అను స్థితిలో ఉన్నారు. ముగ్గురు ప్రవక్తలు చెప్పిన జ్ఞానమే అర్థముకానప్పుడు, వారు మాయను ఎట్లు జయించగలరు? ఒక గ్రంథమును మాత్రము చూచి మిగత రెండు గ్రంథములను చూడని వారు తన జ్ఞానమే గొప్పదనుకొనుచుందురు. తన ప్రవక్త చెప్పినదితప్ప మిగత ప్రవక్తలు చెప్పిన దానిని గుర్తించనివాడు, ప్రవక్త కూడా కాని ఆదరణకర్త చెప్పు జ్ఞానమును గుర్తించునా? తన మతములోని జ్ఞానమే గొప్పదనుకొని, మిగత మతములో ఏమి చెప్పారో చూడనివాడు తనకు తెలిసిన జ్ఞానమే గొప్పదని, గోడను కట్టుకొని దానిని దాటి రాకుండును. అటువంటపుడు ఇంకనూ తెలియవలసిన జ్ఞానమును ఎలా తెలియును? ఏసు చెప్పినట్లు ఆదరణకర్త వచ్చి సమస్త జ్ఞానము తెలియజేయును అన్నపుడు, ఆ విషయమే ఇటు హిందువులకు, అటు ముస్లీమ్‌లకు తెలియనపుడు, ఇక మేము తెలుసుకోవలసిన జ్ఞానమే లేదనుకొని హద్దు ఏర్పరచుకొందురు. అటువంటపుడు తమ మతములో అర్థము కాని లేక అపార్థమైన (వేరు అర్థము చేసుకొన్న) వాటిని ఆదరణకర్త చెప్పినా తెలుసుకోలేరు. తమ గ్రంథములో చెప్పిన జ్ఞానమునకే సరిగా వివరము తెలియజేసినపుడు తెలియనివాడు, ఇంకనూ తెలియవలసిన జ్ఞానమును గురించి తెలుసు కొనుటకు ప్రయత్నము చేయడు. అటువంటి వానికి స్వర్గమునకు పరలోకము

నకు కూడా తేడా తెలియదు. నేడు గురువులుగా బోధకులుగా చలామణి అగువారు, తమ జ్ఞానమును తప్ప ఇతర ప్రవక్తలు చెప్పిన జ్ఞానమును ఒప్పుకోవడములేదు. ఇతర మతమును ద్వేషించు వారు ఆ మతములోని జ్ఞానమే తెలియనపుడు, ఆదరణకర్త తెలియజేయు జ్ఞానమును ఏమాత్రము లెక్కించరు. ఆదరణకర్త సమస్త జ్ఞానమును తెలియజేయునప్పటికీ, ఆయనను కనీసము జ్ఞానిగా కూడా గుర్తించరు. అటువంటపుడు ఏ మతస్థుడుగానీ సమస్త జ్ఞానమును తెలియుటకు వీలులేదు. అటువంటివాడు సంపూర్ణ జ్ఞానికాలేడు. అతడు మాయను దాటి దేవునివద్దకు పోలేడు. మాయ మతముమీద ఇష్టమును కల్గించి, మతములలోనే పుట్టునట్లు చేయుచుండును. జ్ఞాన పథములో పయనించనీయదు.

ప్రస్తుత కాలములో మాయ మనుషుల మీద మరియొక అస్త్రమును ప్రయోగించి సమస్త జ్ఞానమును తెలియుటకు వీలు లేకుండా చేసింది. క్రైస్తవము, ఇస్లామ్‌కంటే ఎన్నో వేల, లక్షల సంవత్సరములనుండి ఉన్న హిందూమతములో దేవుడు చెప్పిన జ్ఞానమును కప్పిపుచ్చుటకు, మనిషి తన ప్రభావమునుండి బయటపడకుండుటకు, ఇదే నిజమైన జ్ఞానమని మనిషికి చూపిస్తూ, వేదములను మనిషి గొప్పగ పరిగణించునట్లు మాయ చేసినది. సృష్ట్యాదిలోనే దేవుడు సూర్యుని ద్వారా భూమిమీదికి ప్రవేశపెట్టిన దైవజ్ఞానమును, మధ్యలో వచ్చిన వేదములు కప్పిపుచ్చినవి. వేదములు దేవుడు చెప్పిన జ్ఞానముకంటే గొప్పవిగా మనుషులకు కనపడునట్లు మాయ చేసినది. దానితో వేదముల వలలో పడిన హిందువులందరూ దైవ జ్ఞానమును మరచిపోయి, వేదములే గొప్ప జ్ఞానముగా లెక్కించుకొన్నారు. వేదముల వలన మనిషి దేవునికి దూరమై పోయాడు. సృష్ట్యాదిలో దేవుడు తన జ్ఞానమును చెప్పితే, మాయ తన వేదములను నిజమైన జ్ఞానముగా

ప్రచారము చేసి, మనుషులను దానిలో చిక్కుకొన్నట్లు చేసినది. అప్పుడు దేవుడు తన ప్రవక్తల ద్వారా వేరువేరు దేశములలో తన జ్ఞానమును చెప్పించాడు. అలా ప్రవక్తలు చెప్పిన జ్ఞానము హిందువులకు భగవద్గీతగా, క్రైస్తవులకు బైబిలుగా, ముస్లీమ్‌లకు ఖురాన్‌గా ఉన్నది. అయితే భగవద్గీత కంటే ముందే వేదములుండుట వలన హిందువులు వేదములకంటే భగవద్గీతను ముఖ్య జ్ఞానముగా లెక్కించక, వేదములనే గొప్ప జ్ఞానముగా పెట్టుకొన్నారు. భగవద్గీతలో దేవుడు వేదముల వలన నేను తెలియబడనని విశ్వరూపసందర్శన యోగములో 48వ శ్లోకములోను, 53వ శ్లోకములోను చెప్పినా, ఆయన మాటను హిందువులు వినడములేదు. భగవద్గీతలో "త్రైగుణ్యా విషయావేదా" అని సాంఖ్యయోగములో 45వ శ్లోకములో చెప్పాడు. దాని అర్థము **"మూడు గుణముల విషయములే వేదములు"** అని కలదు. అదే భగవద్గీతయందు విజ్ఞానయోగములో 14వ శ్లోకములో *"గుణమయీ మమ మాయా"* అన్నాడు. గుణములే మాయ అని కూడా చెప్పాడు. దీనినిబట్టి వేదములే మాయ అని అర్థమైపోవుచున్నది. వేద రూపములోనున్న మాయను గురించి గీతలో చెప్పినా, హిందువులు భగవద్గీతను లెక్కించక, మాయ అయిన వేదములే చెప్పుకొనుచూ, ఇదే నిజమైన జ్ఞానమని అనుకొంటున్నారు. ఈ విధముగా గీతలో దేవుడు హెచ్చరించినా, బయటపడలేని హిందువులుండగా, వేదముల రూపములో నున్న మాయ క్రొత్తగా ఇతర మతములకు కూడా వ్యాపించినది. క్రైస్తవులు తమ ప్రభువును గురించి వేదములు కూడా గొప్పగా చెప్పాయని చెప్పు చున్నారు. ప్రభువు రక్తము వలన పాపము పరిహారమగునను శ్లోకమును, మరికొన్ని శ్లోకములను చెప్పుచూ వారు కూడా తమ తలలో వేదములను చొప్పించుకొన్నారు.

అంతటిలో ఆగకుండా ప్రస్తుత కాలములో కొందరు ఇస్లామ్ బోధకులు కూడా వేదములను కంఠస్థము చేసుకొని, వేదములలోని సంస్కృత శ్లోకములను చెప్పుచూ, తమ ఇస్లామ్‌కు సంబంధించిన సమాచారము ఎంతో వేదములలో ఉన్నదని చెప్పుచున్నారు. ప్రత్యేకించి ఋగ్వేదమును ఎక్కువగా చెప్పుచున్నారు. ఇదంతా చూస్తే వేదములు ఒక్క హిందువులనేకాక మిగత క్రైస్తవ, ఇస్లామ్ మతముల వారిని కూడా ఆకర్షించినవని తెలియుచున్నది. మూడు గుణముల విషయములే వేదములనీ, గుణములే నా మాయ అనీ దేవుడే గీతలో చెప్పడము వలన వేదములే మాయయని తెలిసి పోయింది. ఇప్పుడు మూడు మతముల వారు కనిపించు వేదములను ఆశ్రయిస్తూ, కనిపించని మాయలో చిక్కుకొన్నారు. మాయలో చిక్కుకొన్న వారిని దేవునికి ఇష్టములేనివారిగా మాయ గుర్తించి, దేవుని మార్గము నుండి దూరము చేయగలదు. మాయ తన జ్ఞానమే గొప్పదని చూపిస్తూ, అందులో కూడా దేవుని విషయములున్నట్లు అక్కడక్కడ దేవుని గురించే చెప్పినట్లు కనిపిస్తూ, దేవునికి దూరము చేయును. అటువంటపుడు మనిషి దేవుని సమస్త జ్ఞానమును తెలియలేడు. అందువలన మనిషి మాయనుండి బయటపడుటకు మూడు మతముల గ్రంథాలు చదవాలి. ముగ్గురు ప్రవక్తలు చెప్పిన దానిని సరిగా అర్థము చేసుకోవాలి. తర్వాత తెలియని వ్యక్తి (ఆదరణకర్త) చెప్పు సమస్త జ్ఞానమునూ అసూయ లేకుండా తెలియాలి. అప్పుడే మనిషికి జ్ఞానము అర్థముకాగలదు. సమాదిలోనికి చేరక దేవునిలోనికి చేరగలడు.

**సమాప్తము**



**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

# హిందూ రక్షణా! హిందూ భక్షణా!!

## భగవద్గీతయే చదవనివాడు హిందూ రక్షకుడా?

## హిందూ ధర్మమే తెలియనివారు హిందూ రక్షకులా?

హిందువులు నేడు కులాలుగా చీల్చబడి, అందులో హెచ్చుతగ్గు కులములుగా వర్ణించబడియున్నారు అనుట అందరికీ తెలిసిన సత్యమే. దేవుడు మనుషులందరినీ సమానముగా పుట్టించితే కొందరు మనుషులు తమ స్వార్థ బుద్ధితో హిందూ (ఇందూ) సమాజమును ముక్కలు ముక్కలుగా చీల్చి బలహీనపరచి హిందూ సమాజమునకంతటికీ తామే గొప్పవారమనీ, తాము చెప్పినట్లే అందరూ విని అన్ని కార్యములు చేసుకోవాలని ప్రచారము చేసుకొన్నారు. ఎన్నో కులములుగాయున్న హిందూసమాజములో తమ కులమే అగ్రకులమని చెప్పుకోవడమే కాకుండా, ఇతర కులముల వారందరికీ తామే మార్గదర్శకులమనీ, గురువులమని ప్రకటించుకొన్నారు. భవిష్యత్తులో తమకు ఎవరూ అడ్డు రాకుండునట్లు, అన్ని కులములను అంటరాని కులములను చేసి, హిందూ సమాజమునకు తీరని అన్యాయము చేశారు. అంతటితో ఆగక నేటికినీ హిందూ సమాజ రక్షకులుగా చెప్పుకొనుచూ, హిందూ సమాజమును సర్వనాశనము చేయుచూ, హిందూ సమాజము ఇతర మతములుగా మారిపోవుటకు మొదటి కారకులగుచున్నారు. అటువంటి వారు హిందూ సమాజమునకు చీడపురుగులుగాయున్నా, మిగతా కులముల వారందరూ వారి నిజ స్వరూపమును తెలియక వారు చెప్పినట్లే వినుట వలన, హిందూ సమాజమును పూర్తిగా అజ్ఞాన దిశవైపుకు, అధర్మ మార్గమువైపుకు మళ్ళించి, ప్రజలకు ఏమాత్రము దైవ జ్ఞానమును తెలియకుండా చేసి, తాము చెప్పునదే దైవబోధయని నమ్మించారు.

అటువంటి స్థితిలో నేడు త్రైత సిద్ధాంతకర్తగా ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారు అజ్ఞాన దిశవైపు నిలిచిపోయిన హిందూసమాజమును సరియైన దారిలో పెట్టుటకు, **భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయమున బోధింపబడిన క్షర, అక్షర, పురుషోత్తమ అను ముగ్గురు పురుషుల విషయమును త్రైత సిద్ధాంతము అను పేరుతో ప్రతిపాదించి దైవజ్ఞానమును అందరికీ అర్థమగులాగున గ్రంథరూపములో వ్రాయడము, బోధించడము జరుగుచున్నది.** దానివలన నేడు ప్రజలు అసలైన జ్ఞానము తెలియుచున్నదని సంతోషపడుచున్నారు. అగ్రకులముగానున్న వారిలో కూడా ఎందరో తమ అజ్ఞాన చీకటులను వదలి, ఇంతవరకూ తమకు తెలియని జ్ఞానము యోగీశ్వరుల ద్వారా ఇప్పుడు తెలియుచున్నదని సంతోష పడి శిష్యులుగా చేరిపోవుచున్నారు. అయితే అగ్రకులములో కొందరు మాత్రము యోగీశ్వరులు తెలియజేయు జ్ఞానవిషయములను చూచి ఈ జ్ఞానము వలన ప్రజలు జ్ఞానములో చైతన్యులై, జ్ఞానము తెలియని తమను గౌరవించరని భావించి, దానివలన సమాజము మీద తమ ఆధిపత్యము లేకుండా పోవునని తలచి, యోగీశ్వరులు తెలుపుచున్న త్రైత సిద్ధాంతము గానీ, త్రైత సిద్ధాంత భగవద్గీతగానీ హిందువుల జ్ఞానమే కాదనీ, అది క్రైస్తవ మతమునకు సంబంధించినదనీ, దానిని ఎవరూ చదవకూడదని ప్రచారము చేయను మొదలు పెట్టారు. అంతేకాక తాము హిందూధర్మరక్షకులమని, కొంత రాజకీయరంగు పూసుకొని, మా జ్ఞాన ప్రచారమునకు అక్కడక్కడ అడ్డు పడడము జరుగుచున్నది. తమ మాట విను ఇతర కులముల వారికి కూడా ప్రబోధానందయోగీశ్వరులు చెప్పు జ్ఞానము హిందూ జ్ఞానము కాదు, క్రైస్తవుల జ్ఞానమని హిందువుల ముసుగులో క్రైస్తవ మత ప్రచారము చేయు చున్నారని చెప్పడమేకాక, అటువంటి వారిని ప్రేరేపించి మా ప్రచారమునకు అడ్డు తగులునట్లు చేయుచున్నారు.

యోగీశ్వరులు నెలకొల్పిన **హిందూ (ఇందూ) జ్ఞానవేదిక** ఇటువంటి ఆగడాలను కొంతకాలముగా ఓర్పుతో చూడడము జరిగినది. మాలో ఓర్పు నశించి మమ్ములను అన్యమత ప్రచారకులుగా వర్ణించి చెప్పు అగ్రకులము వారిని, వారి అనుచరులను మేము ఎదురుదిరిగి ప్రశ్నించడము జరిగినది. మేము ప్రశ్నించిన ఒక్క ప్రశ్నకు కూడా వారు సరియైన సమాధానము ఇవ్వలేదు. ఆ జవాబులు ఎలా ఉన్నాయో పాఠకులుగా మీరు చూడండి.

**మా ప్రశ్న :- ఇంతవరకు ఏ హిందువూ చేయని విధముగా ఊరూరు తిరిగి, ఊరులో ఇల్లిల్లూ తిరిగి హిందూ ధర్మములను ప్రచారము చేయుచున్నాము కదా! అటువంటి మమ్ములను మీరు అన్యమత ప్రచారకులుగా ఎందుకు చెప్పుచున్నారు?**

**వారి జవాబు :-** హిందూమతములో ఎందరో స్వామీజీలున్నారు. వారు ఎవరూ ఇల్లిల్లు తిరిగి ప్రచారము చేయలేదు. హిందువులు అట్లు ఎవరూ ప్రచారము చేయరు. క్రైస్తవులయితేనే బజారు బజారు, ఇల్లిల్లు తిరిగి ప్రచారము చేస్తారు. మీరు హిందువుల ముసుగులో ఇల్లిల్లు తిరిగి క్రైస్తవమును ప్రచారము చేయుచున్నారు.

**మా ప్రశ్న :- మేము క్రైస్తవులమయితే భగవద్గీతను ఎందుకు ప్రచారము చేస్తాము?**

**వారి జవాబు :-** మీరు ప్రచారము చేయునది త్రైత సిద్ధాంత భగవద్గీత. అది క్రైస్తవులది. బైబిలుకే మీరు అలా పేరు పెట్టారు.

**మా ప్రశ్న :- క్రైస్తవులు తమను క్రైస్తవులుగానే చెప్పుకుంటారు. అలాగే**

బైబిలును బైబిలుగానే చెప్పుకొంటారు. వారి ప్రచారము క్రైస్తవము, బైబిలు అయినప్పుడు అదే పేరుమీద ప్రచారము చేస్తారు తప్ప హిందువులుగా భగవద్గీత పేరుతో ఎందుకు ప్రచారము చేస్తారు? ఇంతవరకు అట్లు ఎక్కడా జరుగలేదు. ఏ మతము వారు ఆ మతము పేరు చెప్పుకొంటారు గానీ ఇతర మతము పేరు చెప్పరు. అంతెందుకు మీరు మా భగవద్గీతను తెరచి చూచారా? అందులో భగవద్గీత శ్లోకములున్నాయా? బైబిలు వాక్యములున్నాయా?

**వారి జవాబు :-** త్రైత సిద్ధాంతమని యున్నది కదా! త్రైతము అంటే త్రిత్వము అని త్రినిటి అని మాకు బాగా తెలుసు.

**మా ప్రశ్న :- హిందూ ధర్మములలో అద్వైత సిద్ధాంతమును ఆదిశంకరా చార్యుడు ప్రతిపాదించాడు. విశిష్టాద్వైతమును రామానుజాచార్యులు ప్రతి పాదించాడు, ద్వైతమును మధ్వాచార్యులు ప్రకటించాడు. ఇప్పుడు ఆచార్య ప్రబోధానందయోగీశ్వరులు త్రైత సిద్ధాంతమును ప్రతిపాదించాడు. సిద్ధాంతకర్తలు, సిద్ధాంతములు వేరయినా అందరూ హిందువులని మీరు ఎందుకు అనుకోలేదు?**

**వారి జవాబు :-** మీ త్రైత సిద్ధాంత భగవద్గీతలో యజ్ఞములను చేయకూడదని వ్రాశారు కదా! నిజముగా భగవద్గీతలో అలా లేదు కదా!

**మా ప్రశ్న :- మీరు హిందువులలో ముఖ్యులుగా వుండి అంత మూర్ఖముగా మాట్లాడితే ఎలా? ప్రపంచమునకంతటికి ఒకే భగవద్గీతయుంటుంది గానీ, మీ భగవద్గీత, మా భగవద్గీతయని వేరుగా ఉండదు. భగవద్గీతకు వివరము ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా వారికి అర్థమయినట్లు చెప్పియుండవచ్చును**

**గానీ, అందరికీ భగవద్గీత మూల గ్రంథమొక్కటేనని గుర్తుంచుకోండి. త్రైత సిద్ధాంత భగవద్గీత అన్నిటికంటే సరియైన భావముతో యున్నదని చదివిన జ్ఞానులందరూ పొగడుచూయుంటే, మీ కులములో ఎందరో ప్రశంసించుచూ యుంటే, మీకు కొందరికి మాత్రము వ్యతిరేఖముగా కనిపించిందనడము అసూయతోనే అని మాకు అర్థమగుచున్నది. యజ్ఞములు చేయవద్దని మేము ఎక్కడా చెప్పలేదు. యజ్ఞముల వలన పుణ్యము వస్తుంది, స్వర్గము వస్తుంది అని చెప్పాము. యజ్ఞముల వలన మోక్షము రాదు, దేవుడు తెలియడని చెప్పాము. అంతెందుకు మీరు మేము అన్ని కులములకంటే స్వచ్ఛమయిన హిందువులమని చెప్పుకొంటున్నారు కదా! భగవద్గీతలో చెప్పిన ఒక్క హిందూ ధర్మమును చెప్పండి.**

**వారి జవాబు :-** అవన్ని మాటలు వద్దు... మీరు హిందువులు కాదు.

**మా ప్రశ్న :- మొండిగా మాట్లాడవద్దండి మీరు అగ్రకులము వారమని ఇష్టమొచ్చినట్లు మాట్లాడకండి. మేము హిందువులము కాము అనుటకు ఆధారము ఏమైనా చూపగలరా? మా కథ అట్లుంచి మీరు సరియైన హిందువులే అయితే భగవద్గీతలో విశ్వరూప సందర్శనయోగమను అధ్యాయములో 48వ శ్లోకములోనూ, 53వ శ్లోకములోనూ భగవంతుడు ఏమి చెప్పాడో మీరే చెప్పండి.**

**వారి జవాబు :-** మేము ఇంతవరకు భగవద్గీత చదువలేదు. మీకు కావలసి వస్తే సంపూర్ణానందస్వామితో చెప్పిస్తాము.

**మా ప్రశ్న :- కనీసము భగవద్గీతను కూడా చదువని మీరు యోగీశ్వరులయిన ప్రబోధానందస్వామిని దూషించడము మంచిదా? ఒక్క హిందూ ధర్మమును కూడా తెలియని మీరు హిందూ ధర్మ రక్షకులమని చెప్పడము మంచిదా?**

**యోగీశ్వరులవారు వ్రాసిన ఒక్క గ్రంథము కూడా చదువకుండ మేము తప్ప పూజ్యులుగా, గురువులుగా ఎవరూ ఉండకూడదను అసూయతో ఇలాగ మాట్లాడితే దేవుడు ఓర్చుకోడని చెప్పుచున్నాము.**

**వారి జవాబు :-** హిందూ మతములో ఎందరో దేవుళ్ళున్నారు. శివుడు దేవుడే, శివుని కొడుకు గణపతి దేవుడే, రాముడు దేవుడే, రాముని సేవకుడు ఆంజనేయుడు దేవుడే. అలాంటి హిందూమతములో దేవుడు ఒక్కడే అని చెప్పడము మీది తప్పు కాదా?

**మా మాట :- మేము మతమును గురించి చెప్పలేదు. హిందూమతములో ఎందరో దేవుళ్ళుండడము నిజమే, అయితే హిందూ జ్ఞానములో, హిందూ ధర్మము ప్రకారము విశ్వమునకంతటికీ ఒకే దేవుడని చెప్పాము. భగవద్గీతలో దేవుడు చెప్పినదే చెప్పాము తప్ప మేము దేవతలను గురించి లేరని చెప్పలేదే! దేవతలకందరికీ అధిపతియైన దేవుడు ఒక్కడున్నాడని, ఆయనే దేవదేవుడనీ, అతనిని ఆరాధించమని చెప్పాము.**

**వారి జవాబు :-** మీరు రాముని పేరు చెప్పరు, శివుని పేరు చెప్పరు, వినాయకుని పేరు చెప్పరు. ఎవరి పేరు చెప్పకుండా దేవుడు అనీ, సృష్టికర్తయనీ అనేకమార్లు పేర్కొన్నారు. దేవుడు అను పదమునుగానీ, సృష్టికర్తయను పదమునుగానీ క్రైస్తవులే వాడుతారు. హిందువులు వాడరు. అందువలన మిమ్ములను హిందువులు కాదు క్రైస్తవులు అంటున్నాము.

**మా ప్రశ్న :- క్రైస్తవ మతము పుట్టి రెండువేల సంవత్సరములయినది. సృష్టిపుట్టి ఎన్ని కోట్ల సంవత్సరములయినదో ఎవరూ చెప్పలేరు. సృష్ట్యాది నుండి 'సృష్టికర్త' అను పదమును 'దేవుడు' అను పదమును హిందూ సమాజము వాడుతూనేయున్నది. మొదటినుండి హిందూసమాజములో**

**యున్న దేవుడు, సృష్ఠికర్త అను పేర్లను హిందువులు క్రైస్తవులకేమయినా లీజుకిచ్చారా? లేక పూర్తిగా వారికే అమ్మేశారా? అని అడుగుచున్నాము. సృష్ఠికర్త అనిగానీ, దేవుడు అనిగానీ హిందువులయిన వారు అనకూడదని ఎక్కడయినా ఉన్నదా అని అడుగుచున్నాము?**

**వారి జవాబు :-** మీరు హిందూమతమును కాకుండా అన్యమతమును బోధించుచున్నారనుటకు, మిమ్ములను మీరు హిందువులుగా చెప్పుకోలేదు. హిందువులుగా కాకుండా ఇందువులుగా చెప్పుకొంటున్నారు. అటువంటప్పుడు మీరు హిందూమతమును చీల్చినట్లు కాదా! ప్రత్యేకించి ఇందూమతము అను దానిని ప్రచారము చేసినట్లు కాదా! మీరు హిందువులే అయినప్పుడు మీ గ్రంథములలోగానీ, మీ బోధలలోగానీ ప్రత్యేకించి ఇందువులు అని ఎందుకు చెప్పుచున్నారు?

**మా మాట :-** మేము సూటిగా ఒక ప్రశ్నను అడుగుతాము జవాబు చెప్పండి. 'హిందువు', 'ఇందువు' అను పదములో కొద్దిపాటి శబ్దము తప్ప ఏమి తేడాయుందో మీరే చెప్పండి. తెలుగు భాషను వ్రాసే వారందరూ హిరణ్యకశ్యపున్ని చంపినది నరశింహస్వామి అని చెప్పుచుందురు అలాగే వ్రాయుచుందురు. ప్రస్తుత కాలములో నరశింహులు అని పేరున్నవాడు కూడా వాని పేరును నరశింహులు అని వ్రాయడము అందరికీ తెలుసు. అయితే ఆ మాట తప్పు అలా వ్రాయకూడదు దానిని నరసింహ అని వ్రాయవలెను అని చెప్పుచున్నాము. అడవిలో మృగరాజును సింహము అని అంటాము తప్ప శింహము అని అనము అనికూడ చెప్పుచున్నాము. సింహము అంటే అర్థమున్నది గానీ, శింహము అంటే అర్థము లేదు అని కూడా చెప్పాము. అలా ఉన్నది ఉన్నట్లు చెప్పితే 'ఇందువు' అనే దానికి

అర్థమున్నదిగానీ 'హిందువు' అనే దానికి అర్థములేదు అని చెప్పాము. సృష్ట్యాదిలో పుట్టినది ఇందూ సమాజమనీ, అది మధ్యలో పేరుమారి దృష్టి జిష్టి అయినట్లు 'ఇందూ' అను శబ్దము 'హిందూ' అని పలుకబడుచున్నదని చెప్పాము. ఇందూ పదము ఎందుకు వాడాలి హిందూ పదమును ఎందుకు వాడకూడదని కూడా వివరముగా మా గ్రంథములలో గలదు. ఉన్న సత్యము మీకు తెలిసినా మీరు మాకంటే పెద్ద ఎవరూ ఉండకూడదను అసూయతో మాట్లాడుచున్నారు.

అగ్రకులములో ఎందరో పెద్దలు మా జ్ఞానమును తెలిసి సంతోషించుచుండగా, కొందరు మాత్రము వీధిరౌడీలలాగా తంతాము, పొడుస్తాము, కాలుస్తాము మీరు ప్రచారము చేయవద్దండని చెప్పడము మంచిది కాదు. మా గ్రంథములు ఏదీ చదువకుండా మాట్లాడడమూ, మేము చెప్పిన మాటలను వినకుండా ఇవన్నీ డ్రామాలు, నాటకాలు అనడము మంచిది కాదు. మీరు ఎవరైనా మా గ్రంథములలో ఇతర మతములను ప్రచారము చేసినట్లుగానీ, ఫలానా మతములోనికి చేరమని చెప్పినట్లుగానీ ఉంటే నిరూపణ చేయండి, అలా నిరూపించినవారికి **ఇందూ జ్ఞానవేదిక తరపున పది లక్షల రూపాయలను ఇవ్వగలము. నిరూపించ లేకపోతే మీరు లక్ష రూపాయలు ఏ ఊరిలో శ్రీకృష్ణుని గుడికయినా ఇవ్వవలెను.** ఈ షరతుకు ఎవరైనా ముందుకు వస్తారా? అని అడుగు చున్నాము.

ఇట్లు

**ఇందూ జ్ఞానవేదిక** మరియు

**ప్రబోధ సేవాసమితి**

1) నాలుగు అధర్మములు పది శాతము మనుషులలో ఉండగా,

ఒక్క మతమను అధర్మము 99 శాతము గలదు.

2) యజ్ఞ, దాన, వేద,తపస్సులు నాల్గుకాగా, ఐదవ అధర్మము మతము.

3) దైవ మార్గమునకు పెద్ద ఆటంకము మతము.

4) అన్ని అధర్మములను మించినది మతమను అధర్మము.

5) ప్రపంచ మార్గములో మతము ఉంటే

దైవ మార్గములో హతమై పోతావు.

6) కలియుగములో క్రొత్తగా పుట్టుకొచ్చిన ఐదవ అధర్మమే మతము.

మతాలు నిషేధము, నిషిద్ధము. కులాలు అహేతుకము, అశాస్త్రీయము.

**భగవద్గీత, బైబిలు, ఖురాన్** మూడు ఒకే దైవగ్రంథములోని భాగములే.

మీ మనోభావము కులమతాలకు అతీతమైతే వెంటనే "ప్రబోధ సేవాసమితి" లో

సభ్యులుగా చేరండి. దేవుడు మిమ్ములను జ్ఞానులుగా చేయాలని కోరుతున్న...



--- శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

ఫోన్ : 09948947630, 09491040963, 09440556968

